ఆం॥ ప్ర॥ ప్రభుత్వంచే గ్రంథాలయాల ఉపయోగార్థం అనుమతించబడినది
జాబితా III నెం. 5513/653 (1972)

# అల్లూరి సీతారామరాజు

## మహోజ్జ్వల చారిత్రక నాటకం

21 వ. ముద్రణ

---

ఏకపాత్రాభినయ అనుబంధంతో

---

రచన:

పడాల

ప్రచురణ:
ఆంధ్రశ్రీ పబ్లికేషన్స్
రాజమండ్రి - 533 103

| | | | |
|---|---|---|---|
| రచన | 1950 | మొదటి ముద్రణ | 1953 |
| రెండవ ముద్రణ. | 1956 | మూడో ముద్రణ | 1958 |
| నాలుగో ముద్రణ | 1960 | ఐదో ముద్రణ | 1961 |
| ఆరో ముద్రణ | 1963 | ఏడో ముద్రణ | 1964 |
| ఎనిమిదో ముద్రణ | 1966 | తొమ్మిదో ముద్రణ | 1968 |
| పదో ముద్రణ | 1969 | పదకొండో ముద్రణ | 1970 |
| పన్నెండో ముద్రణ | 1972 | పదమూడో ముద్రణ | 1976 |
| పధ్నాలుగో ముద్రణ | 1981 | పదిహేనో ముద్రణ | 1983 |
| పదహారో ముద్రణ | 1984 | పదిహేడో ముద్రణ | 1985 |
| పద్దెనిమిదో ముద్రణ | 1988 | పందొమ్మిదో ముద్రణ | 1989 |
| ఇరువయ్యో ముద్రణ | 1990 | ఇరవయ్యొకటో ముద్రణ | 1991 |

ము ద్ర ణ :

**వంశీ ప్రింటర్స్,**

**రాజమండ్రి - 3**

వె ల :

**10-00**

# కృతజ్ఞత

ఇది 21వ ముద్రణ.

ఇది కేరళలో 5 కేంద్రాల్లోనూ, మైసూరులో 5 కేంద్రాల్లోనూ, మహారాష్ట్రలో 3 కేంద్రాల్లోనూ, పశ్చిమ బెంగాల్లో 6 కేంద్రాలలోనూ, ఒరిస్సాలో 2 కేంద్రాల్లోనూ, బర్మా దేశములో 2 కేంద్రాల్లోనూ, ఆంధ్ర ప్రదేశ్ అన్నిమూలలా ప్రదర్శింపబడి స్వర్ణ, రజత పథకాలను అందుకుంది

తెలుగు పత్రికలన్నీ దీన్ని ఉత్తమ నాటకంలా ప్రశంసించాయి. రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి "ఇటువంటి ఉత్తమ నాటకాన్ని చూడగలుగు తున్నందుకు నిజంగా ఎంతో సంతోషిస్తున్నాను" అన్నారు. ప్రముఖ మల యాళ దినపత్రిక "మాతృభూమి" "ఇది తెలుగు నాటకమే అయినా హృదయస్పందనమైన సన్నివేశాలతో, అద్భుత దర్శక ప్రతిభతో మలయాళ ప్రేక్షకులను ఎంతగానో ఆకర్షించింది" అని రాసింది, మరో కేరళ దిన పత్రిక "మలయాళ మనోరమ" వేలాతంపి, భగవత్సింగ్ లాంటి తలవం చని స్వాతంత్ర యోధులకు తలమానికమై పోరిన "అల్లూరి సీతారామరాజు వీరచరిత్ర యీ నాటకంలో అత్యద్భుతంగా చిత్రీకరింపబడింది" అని వక్కా ణించింది.

ఈ నాటకానికి రూపాయల్నీ, రక్తాన్నీ చెమటగామార్చి ప్రదర్శన లిస్తున్న ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని నాటక సమాజాల వారికి, అన్యభాషా ప్రాంతాలైన కేరళ, మైసూరు రాష్ట్రాలలో ప్రదర్శనలిచ్చిన ఆంధ్రప్రదేశ్ సెక్రటరియేటు కల్చరల్ అసోసియేషన్ హైదరాబాదు వారికి మహారాష్ట్ర లోనూ, పశ్చిమ బెంగాల్లోనూ బర్మాదేశములోనూ ప్రదర్శనలిచ్చిన ప్రజా

నాట్యమండలి వారికీ, ప్రగతి యూనివర్సల్ థియేటర్ టీటాగర్ వారికి, ఒరిస్సాలో ప్రదర్శనలిచ్చిన నవోదయ నాట్యమండలి జయపూర్ వారికీ, ఇటీవల హైదరాబాదు, గుంటూరు, విజయవాడ పలు ప్రాంతాల్లో ప్రదర్శన లిస్తున్న కృష్ణవేణీ ఆర్టు థియేటరు విజయవాడ వారికీ వివిధ ప్రదేశాల్లో 50 వరకూ ప్రదర్శన లిచ్చిన ఏలూరు రమేశ్ ఆర్టు థియేటరు వారికి కృతజ్ఞుణ్ని

పదో ముద్రణ నుండి సీత పాత్రను తగ్గించా, భార రహితం చేయ డానికి వీరయ్యదొర, భాస్కరరావు పాత్రలను కూడా తగ్గించా. రాజును వాస్తవంగా కాల్చి చంపినవాడు గుడల్ కావడం వల్ల ఆ పాత్రను రూథర్ ఫర్డు స్థానంలో ప్రవేశపెట్టా, కొన్ని సన్నివేశాలను నాటకీయం చేశా.

కొన్ని సమాజాలు యీ నాటకాన్ని గత ముద్రణలోని కొన్ని భాగా లను కలపడమో, ఉన్న భాగాలను తీసివేయడమో చేస్తూ వికృత పరుస్తు న్నారు, అట్టి అవాంఛనీయమైన మార్పులవల్ల నాటక ఔన్నత్యం దెబ్బతిం టుందని గమనించ ప్రార్థన.

అనేకమంది కళాకారుల కోరికపై ఇందులో ఏకపాత్రాభినయాన్ని అనుబంధించినాను.

రాజమండ్రి-3
మేడే 1991

భవదీయుడు.

వడాల రామారావు

# పాత్రలు

## సీతారామరాజు

వయస్సు 25 సంవత్సరాలు. వెనుకకు వొంగిన ఉంగరాల జుట్టు బొద్దుగా పెరిగిన గడ్డం. విశాల నేత్రాలు. ధరించేవి కావిదుస్తులు. విప్లవ దీక్షాపరుడు.

## గంటందొర

వయస్సు 35 సంవత్సరాలు. పెద్ద మీసం. వెనుకకు పిగ, క్రింద, జులపాలు. ధరించేవి కబ్బా – మోకాళ్ల దిగు పంచె. ఆజానుబాహుడు. గంభీర స్వభావం.

## మల్లుదొర

వయస్సు 30 సంవత్సరాలు. మనిషి పొట్టి. దుస్తులూ, జుట్టూ గంటం వలెనే. స్వభావం మూర్ఖాకారం పాలు.

## వీరన్న పడాల్

వయస్సు 30 సంవత్సరాలు. పొడగరి. ధరించేవి పంచె, లాల్చీ. చెవులకు కుండలాలు, వెనకకు వ్రేలాడే వుంగరాల జుట్టు. పట్టుదల మెండు.

## శింగన్న

వయస్సు 40 సంవత్సరాలు. మోకాళ్ళ వరకూ ముందు వెనుకల వ్రేలాడే గోచీ. బిళ్ళల మొలత్రాడు. ముక్కుకు కాడ. మెళ్లో కంటె పూసలు, భుజంపై కంబళి. అణగారిన ఆవేశి.

## గోవిందు :

కోయ యువకుడు. నడినెత్తిన శిగ, వెనుకకుతిరిగిన వంకీలు, చెవులకు కుండలాలు, వయస్సు 23సంవత్సరాలు, తలకు పేటవాలుగా ఎర్రనిగుడ్డ శిగపై పించం, మెళ్లో తావీదు, దండలకు పూసలు, మోకాళ్ల దిగు పంచె.

## రత్తి :

చెంచుపిల్ల, చలాకైంది. ప్రక్కకు శిగ. ముక్కుకు నత్తు, చెవులకు పూసల కుండలాలు, మెళ్లో పూసలు, బిగుదైన రవిక, రంగుల లంగా, వయస్సు 18.

## బాస్టియన్ :

కన్వర్టెడ్ క్రిష్టియన్, లావూ, నలుపూను, వయస్సు 40 సంవత్సరాలు. కట్ మీసం, కోటూ, పేంటూ ధరిస్తాడు, లోభి. క్రూరుడు,

## సంతానంపిళ్ళై :

వయస్సు 35 సంవత్సరాలు. లుంగీ లోపల చొక్కా, పైన బెల్టూ, ఆపైన కోటూను, చేతిలో గొడుగు. గిల్లి కజ్జాలు పెట్టే రకం.

## సబ్ ఇనస్పెక్టర్ :

ముస్లిం. పిల్లిగడ్డం. వయస్సు 40 సంవత్సరాలు, దుర్మార్గుడు.

## గుడాల్ :

వయస్సు 40 సంవత్సరాలు. బ్రిటిష్ మేజర్, రాజభక్తుడు. క్రూరుడు.

## పోలీసు :

వయస్సు 50 సంవత్సరాలు. టోపీ పూర్వపుది. భయస్తుడు.

**కాలం : 1921-24**

# 1

[సూర్యోదయం, దూరంగా కొండలు దిగువ సర్వే
నెంబరున్న మద్దిచెట్టు, గొడ్డలినాట్లు వినబడుతున్నాయ్]

గోవిం ; (వొళ్లంతా చెమట, కొడుతున్న గొడ్డలిని ప్రక్కకు నెట్టి, వొళ్లంతా విరుచుకొని చెమట విదల్చి, నోటికి ఏటవాలుగా అర చెయ్యి పెట్టి పిలిచాడు) రత్తీ....! ఆకలావురావురుమంటోంటే ఇంకా ఎక్కడుంటివే? (మూడువైపులా చూచి గట్టిగా పిలిచాడు. రత్తీ ........!

రత్తి : (లోపలినుంచే( వొత్తుంటి మామోయ్:
వొత్తుంటినానోయ్
చద్ది - తెత్తుంటినోయ్ !
(అందెల రవళితో వచ్చి చద్దిముంతగల తట్టను దించింది)
చద్దిలోను నా మనసంతా
పిండి పోసినానోయ్ మామా
పిండిపోసినానోయ్ !

గోవిం : ఇంకేం పోస్తివీ !

రత్తి : వలనుమీరిన నా వయసంతా
వొలకపోసినానోయి - మామా
వొలకపోసినానోయ్ !

గోవిం : ఏదీ చూద్దును

రత్తి : అత్రం చెందకు మామ, ఇంకో తాయం తెత్తిని

గోవిం : ఆదేంటంటి?

ర త్తి : సంజుకోసు వా సొగసంతా
నూ రి తెచ్చినానోయ్ మామా
నూరి తెచ్చినానోయి

గోవిం : (తట్టను తాకబోతూ) అయితే తే !

ర త్తి : ఉహూ ! నాకో మాటిత్తనవి సెప్పు !

గోవిం : ఓ సీయిట్టం అడుక్కో.

ర త్తి : ఒట్టేయ్.

గోవిం : ఒట్టు

ర త్తి : (దూరంగా గెంతి)
బుగ్గపై సీకందకుండా
ఒక ముద్దు పెట్టు – మామా
ఒక్క ముద్దు పెట్టు మామా !

గోవిం : (చేయిలాగి) ఓసి దొంగా, ఇందుకా ఇంతకి తెగిత్తిసీ

ర త్తి : (కిలకిలా నవ్వి) ఏంటి తెగిత్తిసీ ?

గోవిం : సీ అయ్యను అడక్కుండా నాతో వచ్చేత్తివి.

ర త్తి : వాదేముంది మామ ! ఒక పూటుంటే మరో పూట పస్తులు పడు తుంటము కులమా – అంతా అసయ్యించుకొనే చెంచు లోళ్ళం తెగువంటే సీదే మామా,

గోవిం : ఎందుకంట ?

ర త్తి : నలుగురికీ అప్పులు, సప్పులు ఇచ్చు కోమందులు మీరు, కులమా! అంతా మెచ్చుకుందు కోయోళ్ళు ? అట్టప్పుడు అయ్యను అట్టా విడిసి నన్ను చేబట్టివి. నువు గొప్పోడివి, మామ.

గోవిం : హే ; మగోడేం చేసినా మనులుకుంటదు – నలుగురిలో, మరి ఆడ దానికి మా చెడ్డకట్టం ర త్తి, నువ్వే గొప్పదానివి.

రత్తి : కాదు నువ్వే.
గోవిం : నువ్వే అంటే ?
రత్తి : ఉహూ! నువ్వే.
గోవిం ; కాదంటే!
రత్తి : కోపమెందుకులే మామ _ పోపీ మనిద్దరికీను,
(ఇద్దరూ పకపకా నవ్వారు.)
పడాలు : (ఓర తలపాగా, కాసుల గుండీలున్న చొక్కా, చేతిలో కఱ్ఱ, తటాలున కోపంగా వచ్చాడు.) ఆపండి ; ఏం నవ్వులూ, నాటకాలు !
(వాళ్లు మరీ విరగబడి నవ్వారు) ఏంటీ పకపకలు ?
గోవిం : నిన్ను చూస్తే నవ్వు ఉండబట్టడంలే పడాలూ.
రత్తి : ఉహూ ! నాకు ఏడుపు ఉండబట్టడంలే :
పడాలు : మీకు కూటిపురుగు తలకెక్కింది.
గోవిం : అవును నీ అబ్బకూడు పెడుతుంటివి కదూ !
పడాలు : కాకపోతే ఊళ్లు ఊళ్ళప్నీ కదిలి రోడ్డు పనికి వస్తుంటే మీరెందుకు రాకపోవాలి ?
గోవిం : ఓ యబ్బో, మనుషుల్ని కొనేస్తి వనుకొంటివే !
పడాలు : అవును, మొలతాడు కట్టిన మగోడూ, తాళికట్టిన ఆడదల్లా రోడ్డు పనికి రావాల్సిందే.
గోవిం : మా రెక్కల కష్టం. ఆకలి పోట్టా; కట్టానికి తగ్గ దుడ్డుముట్టందే పనికి పోగూడదంటివే ?
రత్తి ; (పకాలున నవ్వింది)
పడాలు : జాగర్త ! దొరతనం మాట జవదాటారా ? కొంపలూడ బీకుతారు.
గోవిం : అడవిలో వుంటే అడవినే ఊడబీకిస్తురా ఏంటి ?
రత్తి ; పడాలు మామకు దొరతనం దుడ్డు మాలావు ముడుతుంటిదే ?

పడాలు : ముదతాది, బాగా ముదతాది. దొరతనాన్ని ధిక్కరించడం సూర్యుడ్ని ధిక్కరించినట్టే. జాగర్త కూటికి ముఖమోచిపోతారు.

గోవిం : నీటిచుక్కకైనా నోచుకుందుము కదా !

రత్తి : ఏమో మామా నీటిని కూడా కట్టేత్తరు దొరలు.

పడాలు : కొమ్ములు బాగా మొలిచాయి. అవును మీకీ కొమ్ములిచ్చింది — దొరలే. చేతినిండా పనులు చూపి జేబునిండా డబ్బుపోసి కన్నూ మిన్నూ కానకుండా చేసింది వాళ్ళే. చెట్టూ, పుట్టా ఎక్కి. పురుగూ పిట్టా, పట్టుకు తినే మీకు కడుపునిండా కూడుపెట్టి మత్తెక్కించింది వాళ్ళే.

గోవిం : పరుగెత్తకు పడాలూ పళ్ళూడతాయ్.

పడాలు : పళ్ళూడతాయే ?

గోవిం : కాక ? మన్నెంలో పుట్టి మన్నెపోడినే తిడుతుంటివే ?

రత్తి : తిడుతడు, తిరుతుడు. పెరటికూర పుల్లనంటరు కదా.

పడాలు : కాకపోతే కూలిపనికి రారే ?

గోవిం : రాము, రాము, రాము.

పడాలు : మెడపై చెయ్యేసి లాక్కెడతా !

గోవిం : ఏదీ వెయ్ ?

పడాలు : (మీదికెళ్ళి) ఇదిగో

గోవిం : (వెనక్కి అడుగువేసి, గొడ్డలి తీసి) అయితే రా!

పడాలు : రావాలే (కర్ర విసిరాడు)

రత్తి : (కెవ్వన అరచింది, పడాలు, గోవిందు తీవ్రంగా పోట్లాడుకుంటున్నారు)

గంట : (పరుగెత్తుకొచ్చి) ఆగండాగండి! ఏంటీ పోట్లాట ?

గోవిం : (గొడ్డలిదించి) చూడు మామా. మేం కూలికిరాం మొర్రో అంటే మెడపట్టి లాగుతుండు.

గంట : ఏం పడాలూ ?

పడాలు ; అవును వచ్చి తీరాల్సిందే.

గంట : కాదు మరీ మొగరాజువి. హూ చింతపల్లి ఘాటురోడ్డు పేరుతో అంగుళం లేకుండా డబ్బు మ్రింగుతున్న ఆ బాప్టీయన్‌ని ఒక్క మాటనలేనివాడికి దొరికానటనుకుంటా — యీ అమాయకులు.

పడాలు : ఇది దొరతనం హూకుం.

గంట ; అని వీళ్ళచ్చే బలవంతపు పని చేయిస్తావా ?

పడాలు : బలవంతమెలా అవుతుంది — కూలి యిస్తుంటే.

గంట : ముష్టికూళ్ళిస్తే ఆరు కానులు. అంతేనా. అందులో వీళ్ళ కండలు కరిగించే, చిందించే నెత్తుటి ఖరీదెంత ? నడి ఎండకు మెదడు కరిగి ముద్దకుల్లాంటి రాళ్ళకు కాళ్ళు పగిలి దండలను బద్దలుగొట్టి భూగర్భాలను దొలచడంలో రాల్చిన చెమటబిందువుల కిరాయి ఎంత ? పిచ్చోడా. ఎప్పుడైనా ఆలోచించావా ?

పడాలు : గంటం మామా.

గంట : అవును. మనిషంటే ఎవడనుకున్నావు ? ఎదుటివాడి కన్యాయం, అపకారం తలపెట్టనంతవరకూ వాడికి స్వేచ్ఛవుంది. వాడి మాటకు తిరుగులేదు. వాడి ఉనికికి వాడే మహాప్రభువు. కాని యిప్పటికే ఆ స్వేచ్ఛనంతా దోచుకున్నారు — దొరలు. ఇక మిగిలిన స్వేచ్ఛ — వారికిష్టం లేని పనికి రాననే హక్కు. ఆ మాత్రానికైనా నోచుకోలేదా, యీ దీనులు, పడాలూ ?

పడాలు : స్వేచ్ఛంటూ విధిని ధిక్కరిస్తే ఊరుకోమంటావా ?

గంట ; విధి ! ఏది విధి ? మన పశువులు హాయిగా మేపే బీళ్ళకు కంచె వేయించడం, మనం స్వేచ్ఛగా అనుభవించే అడవులను సర్వే చేయించడం, మనం పొగుచేసే భూముల్ని ముఠాదార్ల కప్పగించడం దొరల విధంటావా ?

పడాలు ; మాట్లాడేవి గంటందొరేనా ?

గంట ; అవును గంటాన్నే. ఎందుకంతాశ్చర్యం ? ఒకానొక దొరల చేతి క్రిందనున్న చిన్న మనుషులు ఆ దొరలకే ఎదురుతిరిగి మాట్లాడు తున్నారనా ? లేక ఎన్నడూ బయటపడి మాట్లాడి ఎరుగని గంటం యీనాటిలా తెగించి మాట్లాడుతున్నాడనా ? ఆశ్చర్యపడకు పడాలూ కొంపలంటుకున్నాక నూతులు త్రవ్వి ప్రయోజనం లేదు. ఇప్ప టికే దొరల దుష్కృత్యాలు పెచ్చు పెరిగాయ్. తెలివైనవాడివి. ఒకప్పుడు పొలం పుట్రా వున్న తామందువు ఆలోచించు - ఇప్పుడా పొలం పుట్రా ఏమైందో ? ఏండ్లుకే మేస్త్రీ పనికి నోచు కున్నావో ?

పడాలు : ఆగు గంటం గ్రుక్క త్రిప్పుకోనియ్.

గంట : మరేం కంగారులేదు. ఆలోచించు; మనలో మనకే చీలికలు పెట్టి మనలో అంత బలం గలవారికి మేస్త్రీ పనులిచ్చి మన చేతనే మన కోయలపై దౌర్జన్యాలు చేయించే యీ దొరల కుట్రలను లోతుగా ఆలోచించు. దొరక్కపోదు—దాని అంతు: నే వెడతా....

పడాలు : గంటం మామా !

గంట : (నడుస్తూ వెనుదిరిగి) ఆలోచించు పడాలూ?

మల్లు ; (రోషావేశంతో పిడుగులా వచ్చాడు. చెమటకు అతడి దుస్తులు తడిసాయి) అన్నా.

గోవిం : ఏంటి మల్లుమామా,

మల్లు ; రంజిల్లిపోయారు....రౌడీ ఎదవలు.

గంట : ఎవరూ ? అసలు కధేంటి ?

మల్లు ; కధకాదు, వ్యధ. ఎధవ నాయాళ్ళు ముక్కముక్కలుగా కోసినా కసి తీరదు. ముక్కూ మొఖం పిండి పారెయ్యాలి.

గంట ; మల్లూ ! ఎక్కడున్నావ్. ఎవరితో మాట్లాడుతున్నావ్ ?

మల్లి ; ఇంకా ఎక్కడ ? ఎవరంటావేంటన్నా ? ఎఱ్ఱబట్టలోళ్లు మన కూలి జనాన్ని కుమ్మి కుమ్మి వొదిల్తిరి. నెత్తురు మడుగులైనది........

గంట ; ఎందుకనీ ?

మల్లి ; ఏముందన్నా, ఘోరస్నేయం చేస్తిరి. కూలెక్కువివ్వమని పని చేయించుకుంట్రటి. పనికాస్తా తీరినాక నాలుగు కాసులాళ్ళ మొఖాన కొట్టింట్రు. "ఏంటి దొరా ?" అంటే వీపులు చిట్లగొడ్తిరి. కొంపనాయాళ్లు.

పేదాలు ; నువ్వు సెప్పింది నిజమా మల్లూ ?

మల్లి : (వెనక్కి తిరిగి బల్లేన్ని ఎత్తుతూ) ఓ నువ్వు యిక్కడుంటి వేంటి ? నా సామిరంగా మిమ్మల్నా ?

గంట ; (మల్లిను ముందుకు త్రిప్పి) మల్లూ, ఏమిటీ ఆవేశం ?

గోవిం ; ఆవేశం కాక ఎంత దుస్నేయం గంటం మామా ? ఇట్టా నల్లేరుపై బండి దొర్లిపోతమేనా అంట ?

గంట ; అదే నా ఆలోచన గోవిందూ ?

మల్లి ; అబ్బ ఎందుకన్నా ఆలోచన ? నువ్విలా నుంచుంటివా ? ఆ ఎఱ్ర బట్టలోళ్ళ సంగతి నేను తేల్చివేత్తను.

గంట ; కాదు మల్లూ. ముందు మనం ఆ బాస్టియన్‌ని కలుసుకోవాలి.

రత్తి ; ఎందుకంట ?

గంట ; ఈ అన్యాయాలి నాపమని చెప్పాలి.

మల్లి ; వాడినకేం దున్నపోతీనకేం ?

గంట ; అయినా అధికార్లకు మొర వినిపించడం మన ధర్మం మల్లూ.

గోవిం ; వాడు కాదంటే ?

గంట ; తర్వాత తేల్చుకుంటాం.

మల్లి ; వాళ్ళంతే తేల్చుకుందము పదండహే.

గంట : పడాలూ విన్నావు కదూ, ఇప్పుడు నీవూ తేల్చుకో, మీరుండండి గోవిందూ.

గోవిం : అంతవరకూ సాగనంపి వత్తుము పద మామా.

మల్లా : పదండి. (అంతా వెళ్ళిపోయారు.)

పడాలు : (చిత్తభ్రమణంతో అటూ ఇటూతిరుగుతున్నాడు.)
ఏమిటి నా కోయలపై నేనే దౌర్జన్యాలు సాగిస్తున్నానా ?
(నేపథ్యంలో మాటలు వినబడుతున్నాయ్.)
గంట : కాకపోతే ఆ చింతపల్లి ఘాటురోడ్డు పేరుతో అంగుడు లేకుండా డబ్బు మ్రింగుతున్న బాస్టియన్‌ని ఒక్కమాట అనలేని వాడికి దొరికారమకుంటా — యీ అమాయకులు)
గంటం ?
(మల్లు : కూలెక్కువి స్తమని పని చేయించుకుంట్రి, పని కాస్తా తీరినాక నాలుగు కాసు లాళ్ళ మొఖాన కొట్టింగ్రు. "ఏంటి దొరా" అంటే వీపులు చిట్లగొట్టిరి — దొంగనాయాళ్ళు.)
మల్లూ ?
(గంటం : మన పశువులు మేసే బీళ్ళకు కంచె వేయించారు. మనం స్వేచ్ఛగా అనుభవించే అడవులను సర్వే చేయించారు. మనం సాగుచేసే భూముల్ని ముఠాదార్ల కప్పగించారు....)
అవును నా భూముల్ని ముఠాదార్లు లాక్కున్నారు.
(గంటం : అంతేకాదు, మనలో మనకే చీలికలు పెట్టి మనలో అండబలం గలవానికి మేస్త్రీ పనులిచ్చి మనచేతనే మన కోయలపై దౌర్జన్యాలు చేయించే యీ దొరల కుట్రలను లోతుగా ఆలోచించు)

విజం గంటం. నిజం. ఇంకాలోచించక్కర్లేదు. నిప్పులాంటి విజంతో నా కళ్ళు తెరిపించావ్. మత్తు వొదిలించావ్. నాకున్న అండ దండ బలాన్నిక ముందా దొరలే చవిచూస్తారు,........
(వికటాట్టహాసాలు _ రత్తి : పడాలు మామకు దొరతనం దుద్దు మాలావు ముదుతుంటిదే)
(గోవిం : కాక మన్నెంలో పుట్టి మన్నైపోటినే తిడుతుంటివే)
(మల్లు : నాసామి రంగా, మిమ్మల్నా?)
అబ్బా? మీ పరుషవాక్కులతో నన్ను చిత్రవధ చేయకండి. ఇక యీ పడాలు కుబుసం వీడిన కొండనాగు. నామాట నమ్మండి. ఈ దొరల దురంతాల నికముందు సాగనివ్వను. (గర్జించాడు.) గంటం. మల్లూ, గోవిందూ....

స. ఇ : (తటాలున వచ్చాడు. పోలీసులతో) అహ్హ హ్హ హ్హ బేవకూఫ్। కత్తిపై సాము కర్నాచాహ్‌తే ?

పడాలు : కత్తిపై కాదు _ మీ కుత్తుకలపై.

స. ఇ. : క్యాబోలా. శరభయ్యా. పకడో ఉన్కో.

పోలీ : అచ్ఛా సాబ్.

పడాలు ; ఊ. రమ్మను.

స. ఇ. : (రివాల్వరు చూపుతూ, పైకి కాల్చాదు) లేజాకే లాకప్ కరో. చెరో జబ్బా పట్టుకొని లాక్కెడుతున్నారు.

పడాలు : ఓరి సీచుల్లారా. మిమ్మల్ని మన్యం రక్షకులని భ్రమించాను _ కాదు భక్షకులు.

స. ఇ. : అరె చల్ చల్ బే చల్.

గోవిం : (కొద్ది క్షణాలకు రత్తితో ఆతృతగా వచ్చాడు. ఎవరూ లేరు), ఏంటి రత్తి, ఏంటో వెర్రి కేకలు వినిపించినట్టుంటిదే.

రత్తి : ఆకలికి నీ పొట్టలో పేగులు అరుత్త వనుకుంటమలే మామా.
బద్ది తిను.

గోవిం : మరచిపోతినే. తే రత్తీ !

రత్తి : వొత్తుంటీ నానోయ్ మామా
బద్ది — తెత్తుంటినోయ్ మామా
బద్దిలోమా నా మనసంతా
పిండిపోసినానోయ్ మామా
పిండిపోసినానోయ్ ॥
వలనుమీరిన నా వయసంతా
వొలకబోసినానోయి — మామా
వొలకబోసినానోయ్ ॥
వంజుకోమ నా సొగసంతా
మూరితెచ్చినానోయ్ మామా
మూరితెచ్చినానోయి॥
వొత్తుంటీ నానోయ్ మామా
బద్ది — తెత్తుంటీనోయ్ ॥

గోవిం : ఏదీ ?

రత్తి : (తట్టను తటాలున తీసి) సరి. నువ్వు తిను మామా ! నానీలోగా నాలుగు తునికి పండ్లేరుకొత్తును.

గోవిం : (బద్ది తింటూ) సంసారం వంటవ ట్టిదే ?

రత్తి : వొల్లొంచి కట్టెలు కొడుతుంటివే నీకు పట్టనేదూ ?
(తట్టతో విసురుగా వెళ్ళబోయింది)

గోవిం : (పైటబట్టి) కొత్తకుండ గట్టిగా పట్టూ !

రత్తి : పో మామా (చర్రున వెళ్ళిపోయింది)

గోవిం : (గంజి త్రాగి) ఉత్సాహంగా లేచి నడుం గుడ్డ తలకు కట్టి గొడ్డలి తెచ్చి సర్వే నెంబరున్న చెట్టును నరుకుతున్నాడు)

ఎల్లారే ఎల్లల్ల పిల్లా
పుంతలోన ముసలమ్మ తల్లి
పుట్టిన పిల్లకు పురుడుపోసె
ఎల్లారే ఎల్లల్ల పిల్లా
పుట్టిన పిల్లకు నోరు ఒక్కటి
పుట్టెను పనికి చేతులు రొండూ
ఎల్లారే ఎల్లల్ల పిల్లా
చేతులు రొండూ చల్లగ ఉంటె
చల్లకదలని చక్కని బ్రతుకు
ఎల్లారే ఎల్లల్ల పిల్లా.

స. ఇ. : (తటాలున వచ్చి కొరడాతో లీపుపై [బాదాడు) హైరో !

గోవిం : అమ్మో !

స. ఇ. : నీకీ కనబడ్డం లేదుబే చెట్టుకా సర్వే నెంబర్ ?

గోవిం : (ఎదుటకు తిరుగుతూ) ఓరూ ?

స. ఇ. : హెవరా? బొగరు తలకెక్కిన కోయబద్మాష్ ! (తీవ్రంగా) బోలో సర్వే నెంబరున్న చెట్టుపై గొడ్డలెందుకేసావ్ ?

గోవిం : నెంబరేంటి దొరా ?

స. ఇ. : మాలూం నహీ ! ఏ సర్కారుకా స్వాధీనంలో వున్న చెట్టు, యీ చెట్టుకి హెవడు ముట్టినా వాడి పని కూడా ఖతం హవుతుందని మాలూం నై ?

గోవిం : అదేంటి దొరా, మా మన్నెంలో ఏనాడూ లేదే ?

స. ఇ. : హినాట్ళ్ళ అయా, హింతవరకూ మీకీ తాతల్కి సొమ్ములల్లే హనుభవించారన్న.

గోవిం : ఒకరు అనుభవించేదేంటి దొరా! మా తాత ముత్తాతల ముందు నుండీ మా కద్దులేదే!

స. ఇ. : సరితో హిప్పు మీకీ మాకి హధికారాల్కి తలవంచ వలసిందే

గోవిం : తూత్. మా మన్నెం ఓడికీ తలొంచదు. అది మా మన్నెం పుట్టుక్కే లేదు.

స. ఇ. : ఒతిమిరుతున్నావ్ — హే శరభయ్యా!

పోలీ : (లోపల) వస్తున్నా సార్.

స. ఇ. : వీడ్కి చస్త్రం పాఠా చేయవాలి. (హంటరుతో కొట్టాడు)

పోలీ : (వచ్చి) అచ్చా సాబ్.

స. ఇ. : వీడ్కి చెట్టుకి బంద్ కరో.

పోలీ : (మెడి కెళ్ళాడు.)

గోవిం : మీకు నేయమా దొరా! ఈ మన్నెం లో ఎప్పుడైనా ఓ చెట్టుకొట్టుకున్నా. ఓ పంట పండించుకున్నా. ఓర్నైనా అడిగితిమా! ఓరైనా అట్టు పెట్టించ్రా చెప్పుదొరా!

పోలీ : అవి మన హయ్యాంరా.

గోవిం : ఇదో!

పోలీ : దొరల హయ్యాం.

గోవిం : వాడేశమంటొచ్చిరిబా!

స. ఇ. : బహూత్ దూర్‌తక్ అయా తూ! చే ఖైఖోవ్యం శరభయ్యా! కట్టు పెట్టుకు, కొట్టు కొరడాతో.

పోలీ : (గోవిందును ప్రక్కలో పొడిచి) ఊ తప్పుకోరా.

గోవిం ? (చెట్టును కావలించుకొన్నాడు) నేనొదల్ను. ఇది నా హక్కు.

స. ఇ. : ఏ నహీ, నీ హక్కు హిది. (చెప్పుతున్నది) చుః కిఫియ్యా. ప్రక్కలిసగదన్ను మాదర్చోద్ కి.

పోలీ : (గోవిందు గింజుకుంటున్నా బలవంతంగా వెక్కలిరిచి తట్టాడు)

స. ఇ. : కుత్తా (మరల కొట్టి, పోలీసులతో) దేఖో మీరు హిచ్చిన లోకువ హిది. ఎర్రటోపీని చూపి వొణకవలసిన వాళ కోయ ఇద్మీష్ ఆ ఎర్రటోపీకే ఏదురు తిరుగుతాడ్. నహీ, నహీ! ఇక ముంచే తుక్కల్ని కాలిక్రింద అణచిపెట్టి మరీ అధికారం చెలాయిస్తాం. యాద్ రఖో.

పోలీ : అచ్చా సాబ్.

స. ఇ. ; హచ్చాఖ్యా ? జావ్. ఊళ్ళోకి వెడదామన్న బాప్టియన్ దొర ఎందాకా వచ్చాడో దేఖో కె ఆవ్.

పోలీ : అలాగే సార్ (వెళ్లాడు)

స. ఇ. ; (గోవిందుతో) ఖబడ్దార్. బాప్టియన్ దొర హంటే హీ పన్యానికే పాదూషా. అయన్కి పేరు వింటేనే పిట్టల్కి సిచ్చు ముట్టవ్ పీ సంగతి కాని సునేతో....

గోవిం ; ఏవయినా తలకొట్టి మొలేస్తురా ?

స. ఇ. : మొలెయ్యర్ పీకలోతు గోతిలో పాతి, ఉక్కు జోడుతో తొక్కి తొక్కి ఖైమా చేస్తార్. (కొట్టబోయాడు లోపల "ధన్" మని శబ్దం. వెడుతున్న పోలీసు వెనక్కి తూలి తనపై పడ్డాడు. వార్నితోపి) క్యారే. డర్ తే క్యోం, ఏ కౌన్ హై!

పోలీ ; దొ....దొ....దొర కాల్చుకుంటూ వస్తున్నారు సార్!

స. ఇ. ; కౌన్ ?

పోలీ ; దొ....దొ....దొర.

స. ఇ. : ఆరె హెవర్ని ? హెందూ? (ముందుకెళ్ళబోయాడు)

బాస్టి ; (కాల్చిన తుపాకిని దించి, వికటాట్టహాసంతోవచ్చి) ఏడి లింగన్నా !

స. ఇ. ; నహీ ఆయా సాబ్.

బాస్టి : పిలిపించు. చెమిటి వెధవని !

స. ఇ. : శరభయ్యా ! ఛలో వాడ్కి లాక్కురా.

పోలీ ; అచ్ఛాసాబ్. (శాల్యూట్ చేసి వెళ్ళాడు)

బాస్టి : (వెనక్కి తిరిగి) వీడెవడు ?

స. ఇ. : సర్వేసెంబరున్న చెట్టుపై గొడ్డలేసిన బద్మాష్.

బాస్టి : మాంచిపని చేశావ్. సంకెళ్లు వేసి లాకప్‌లో పారేయ్.

స. ఇ. : ఇంతకు ముందు ఒకడ్ని లాకప్‌లో పారేసాన్ సార్.

బాస్టి : వాడెవడు ?

స. ఇ. ; మనకీ హెదురు తిరిగిన పడాల్.

బాస్టి ; వాట్. పడాల్ ? మన మేస్త్రీ ? మన రోడ్డు పనులకు కూలీ జన
మును తోలుకు వస్తున్న పడాల్,

గోవిం ; (ఆశ్చర్యంగా) పడాల్ నే ,

స. ఇ. ; ఎస్‌సార్. ఆ పడాల్ నే.

బాస్టి ; ఏమి విపరీతం ? రాస్కెల్స్. ఎవడిలో చూచినా అరాజకం, అధి
కార ధిక్కారం. తిరుగుబాటు తత్వం.

పోలీ ; (వచ్చి ఎటెన్షన్‌లో నిలిచి) వస్తున్నాడు సార్.

బాస్టి ; ఏడీ ?

లింగ ; (వెనుక కారుస్తూ వొణుకుతూ వచ్చాడు) దొరా ?

బాస్టి : ఇంకా ఎక్కడేడుస్తున్నావ్ ?

లింగ ; ఏదిదొరా, చీకటుండగా వచ్చిణ్ను. బంగళా తుడిగమంతా
చేసిణ్ను. కబురంపితిరి, వచ్చిణ్ను.

బాప్టి : (హుంకరించి) వచ్చిట్ను, వచ్చిట్ను ఇడియట్. (లాగి లెంప కాయ కొట్టి) ఆ సాహుంకారు సామాను పంపాడా ?

శింగ : (కంపిస్తూ గద్గదంగా) నేదు దొరా. విన్నటి దినం పోయుంటి దుడ్డు తెమ్మవిండు దొరా.

బాప్టి : అః వొంగి సలాంచేసే వెధవకంత పొగరే! ఆ సామాను పాయం త్రానికి పంపకపోతే దుకాణం దూళిలో కలుపుతానని చెప్పు పో.

శింగ : చిత్తం పోతుండా దొరా, (వెళ్ళాడు)

బాప్టి : యస్సై ? జవాన్ని కూడా పంపు.

స. ఇ. (పోలీసుతో) జావ్ టూ నాట్ టూ.

పోలీ : యస్ సార్. (శాల్యూట్ చేసి వెళ్ళాడు)

బాప్టి : (ఛక్ మని తిరగడంలో ఎదురుగా శబ్దం విని) యస్సై అదెవరో చూడు !

స. ఇ. : అచ్చా సార్. (వెళ్లాడు)

పిళ్ళె : (ఒగర్చుతూ గొడుగు ముడుస్తూ) సార్. సార్. సార్.

బాప్టి : ఏమిటీ సార్ సార్,

పిళ్ళె : యస్ సార్.

బాప్టి : ఏంటీ యస్ సార్ ?

పిళ్ళె : నో సార్.

బాప్టి : షటప్ యూ నో వేర్ యూ ఆర్ !

పిళ్ళె : యస్ సార్.

బాప్టి : ఏడిశావ్.

పిళ్లె : ఏడిశాను, (గుటకలు మ్రింగి) నిజంగా ఏడిశాను సార్. ఆ నడింపాలెం మల్లుదా సార్....!

బాప్టి : అ....మల్లూ ?

పిళ్లై ; కూలినాయీలతో పని బందు చేయిస్తిడి సార్.

బాస్టి ; ఎంత పొగరు ? ఎందుకూరుకున్నావ్ ?

పిళ్ళై ; నేనేం చేస్తుము సార్. నేనుదా వొన్నుదా మనిషిని వాళ్లా వొమ్నుదా మాట సార్.

బాస్టి ; ఇంత యంత్రలం మనకుంటే కుక్కలా పారిపేయొచ్చావా ?

పిళ్ళై ; వాడో బలే తంత్రగాడు సార్. వన్ను తరిమి తరిమి విడిచిండు సార్.

బాస్టి ; ఆ కూలివెధవల్కి ఒక్కటా ఎక్కువంటే వాడినే తందురుగా.

పిళ్ళై ; అందామనుకుంటిని....కాని;

గోవిం ; ఎముకులిరుగునవి పెనక్కి వచ్చేస్తివి.

బాస్టి : (గోవిందును) యూ పూల్ .... (వళ్ను కొరికి యస్సై యస్సై అని పిలిచి, వలుకవందున గింజుకొని పిళ్ళైతో) ఊ....కాపీ ?

పిళ్ళై : అసలు పత్తుదినం బట్వాడా ఎగేసివామనే వాళ్ళదా అక్కసు.

బాస్టి ; నాన్సెన్స్ నా సర్వెంటువని తెలిసే మాట్లాడుతున్నావా ?

పిళ్ళై ; అమా సార్;

బాస్టి : షటప్ ? (మితిమీరిన కోపంతో కలద్రొక్కుతూ) విన్న . నడిం పాలెం మీదుకు తంచెవడో తొలగిస్తే ముఠాదారు వెంకప్పా మాట్లాడలేదు. ఈ యస్సై కలుగజేసుకోలేదు.

పిళ్లై ; ఇల్లే సార్,

బాస్టి ; వోర్కుయ్. పోనీ జమాబంది ఖర్చులన్నా వసూలు చేశారా ;

పిళ్లై ; ఇల్లే సార్.

బాస్టి : పిళ్ళై ;

పిళ్ళై ; ఆమా సార్, విన్నటిదినం కంఠమాలల నడిగితిము. "పిట్టలు కొట్టుకుతినే షూకాదేముంది దొరా ;" అని సొల్లిరిసార్.

బాష్టి : దీనికంతటికీ తెర వెనుక ఏదో కుట్ర వుంది.

పిళ్ళై : (మెల్లిగా బాష్టియన్ చెవివద్దకు వొంగి) ఇరిక్కిదాసార్.

బాష్టి : ఏమన్నావ్ ?

పిళ్లై : ఆమాసార్. ఇదంతా అక్షమల్లూ, వాదన్న గంటం దొరల ప్రోప గండా సార్ ! కొత్తభూమి చట్టం రద్దుచేస్తేనేగాని ఎర్రటి ఏగాడ నేదిరాదని గంటం కూడా....

బాష్టి : ఆ గట్టు పోణకల మునసబే ?

పిళ్లై : ఆమా సార్.

బాష్టి : ఎంతధైర్యం? ఎంత సాహసం ? ఎదురులేని తెల్ల ప్రభుత్వానికి బెదురులేని ధిక్కారం?....కానియ్ ? వీళ్ళంతిక తెల్చుకోవలసిందే?

గోవిం : నిప్పు తొక్కుతుంటిరి దొరోయ్ ?

బాష్టి : (చెళ్లున కొట్టి) కాదు మీ తలకాయల్ని ?

గోవిం : అమ్మా. (తలవాల్చేసాడు)

(తునికి పండ్లున్న తట్ట అందరిముందూ పడింది. అంతా అటు చూసారు. యస్. ఐ. రత్తి సిగపట్టి బాష్టియన్ పైకి "పద ! శిఖండి ముండ" అంటూ విసిరాడు.)

గోవిం : రత్తీ !

రత్తి : గోవిందూ !

స. ఇ. : దీన్ని తునికి పండ్లేరుతోంది సార్ !

బాష్టి : ఏరుతుందేరుతుంది; అడవిలో తునికిచెట్లన్నీ దీని బాబు నాటిం చాడు – కదూ ? (జుట్టు పట్టి) ఏమే ?

రత్తి : తిండికి మొగమొచివోతిమి దొరా! తునికిపండ్లయినా ఆకలి తీరుత్తవని ఏరితిని దొరా.

బాస్టి : తిండికి ముఖమో స్తే నోటమట్టి కొట్టుకోండి. మన్యంలో ఒక పూతిక పుల్లగాని ముట్టారా తలలు తెగుతాయి జాగర్త !

పిళ్లె : ఇదిదా రోడ్డుపనికి వరిళ్లె సార్ !

గోవిం : మీచే ఏముకలిరగొట్టించుకుంటకా !

బాస్టి : వీడూ రాలేదా ?

పిళ్లె : ఇళ్ళె సార్.

బాస్టి : మరీ వంగతి ముందు చెప్పలేదేం ? (స. ఇ. తో) యస్సై వాడి వంగతి కనుక్కో ! ఏమే బ్రతకాలని లేదే. (జుట్టు పట్టి గింజా యించాడు.)

రత్తి : గోవిందూ !

గోవిం : (పళ్ళు కొరికి) దొరా !

స. ఇ. : (చెళ్ళున కొట్టాడు) హేంటా – పొగరు !

బాస్టి : (రత్తితో) ఏం రోడ్డు పని కొస్తావా ?

గోవిం : ఎందుకు రావాలంట. ఆడుకాసులిత్తురని రెక్కలు ముక్కలు చేసుకొని మీతో చావు దెబ్బలు తినుటకా.

పిళ్ళె : ఎలా వస్తురు ? తునికిపండ్లన్నీ తెగతిని మత్తెక్కి ఏడుస్తుంటరు!

గోవిం : చెట్లు మీరుగాని పాతిరా ?

బాస్టి యస్సై వీడి నోరు మూయించు.

స. ఇ. : (గోవిందును పొడిచాడు)

గోవిం : అమ్మా.........

రత్తి : గోవిందూ ?

బాస్టి : హాం. గోవిందు. (రత్తి జుట్టుపట్టి ఎత్తి) రేపటినుండి, కానీ రోడ్డు పనికి రాకపోయారా ? మీ బ్రతుకులుండవ్ (గోవిందు పైకి

ర_త్తిని విసిరి) పదండి. వూళ్ళో మిగతావాళ్ళ సంగతి కను క్కుందాం. యస్సై జవాన్లను వూళ్ళోకి పంపించు.

స. ఇ. ; అచ్ఛా సాబ్ ! (వెళ్ళాడు)

జాప్టి ; పద పిళ్ళై ! మనం ముందు వెడదాం. (నడిచాడు)

పిళ్లై : ఆమా సార్ (కూడా వెడుతూ ర త్తిని జుట్టుపట్టి ఎదుటికి లాగి) లంకిణీముండ ! దేవుగాని పనికి రాకపోతివా ! (తోసేసాడు)

మల్లు : (అలాపడ్డ ర_త్తిని తటాలున వచ్చి పట్టుకున్నాడు.) ఆగండి. మీ పెతాపం వీపులు చిట్లగొట్టినా ఊరుకునే వెర్రిబాగుల కోయలపై కాదు, ఇదిగో యీ మల్లుదొరపై చూపుడు. తాడో పేడో తేలి పోవును.

పిళ్లై : (బాప్టియన్‌తో) వీడుదా సార్. ఆ కూలినాయాలతో పని బంద్ చేయిస్తిడి (మల్లు నుద్దేశించి) వాయిముదరా, నాయీ !

మల్లు : మూస్తనురా, మా మన్నెం పోదుక్కోపి, పాలు తాగుతుంటిరి. అవన్నీ కక్కిస్తును.

జాప్టి ; షటప్ ఊ యస్సై !

మల్లు ; రారా, ఎర్రబుట్టలోళ్ళని ఉపిగొల్పి, మా కూలిజనాన్ని కుమ్మి కుమ్మి వొదులుటనుకొంటివా ? వీడు మల్లురా ? రణమల్లు !

స. ఇ. : బంద్‌కరో. (కొరడా విసిరాడు)

గంట ; (తటాలున వచ్చాడు. ఆ దెబ్బ అతడికి తగిలింది) ఆపండి! నేను బ్రతికుండగా యీ నా తమ్ముని వొంటిపై చెయ్యేయ్యలేరు, తెల్లనివన్నీ పాలనుకునే అమాయక జాతిని హింసించడం పాడి గాదు.

ర_త్తి : గంటం మామా !

గంట : భయపడకమ్మా.

బాస్టి : హుః పలుకుబడి గల పెద్దవే. మాదే హింసంటున్నావా ?

మల్లు : ఏం ? పలుకుబడి పలుపుత్రాడులా పనిచేస్తుందనా పొగ త్త ?

పిళ్ళై : పలుపుతాడే ప్రసేగాని సీతిలేని మన్యంజాతి లొంగదని.

మల్లు : ఏమన్నావ్ (పాదాన్ని నేలను తాడించాడు) సీతిలేని జాతి మీదా మాదా ? ఆ రోడ్డు పనికాడ చిటికెలో దాటిపోయుంటివి నాయాళ ! లేకపోతే నీ ఓవర్సీర్ పస తేలిపోవును.

గంట : (గద్దించి) మల్లూ ! ఆపువెయ్. (బాస్టియన్‌తో) అయ్యా మా సాముదాయక సంపదవంతా మీ వశం చేసుకున్నారు. మన్యం మలమల మాడిపోతోంది. మొన్న నడింపాలెంలో రామన్నదొర భార్య పాపం; విన్నకాక మొన్న ముచ్చటగా పెండ్లయింది. ఆ పాద పారాణీ, కండ్ల కాటుకైనా ఆరకుండానే కాటికి పయనం చేసేసింది. ఎందుకో తెల్సా దొరా ? ఆకలికి అల్లాడి పోవటంవల్ల చింతంబలి త్రాగగా కలరా సోకడంవల్ల. ఇన్ని జరుగుతున్నా ఇదంతా ఖర్మని మాకు మేమే దూషించుకున్నాం గాని మిమ్మ పల్లెత్తు మాటైనా అనలేదే ! ఒక్కపారి మా బాధల్ని గమనించండి దొరా ! నాలుక్కోసినా అబద్ధమాడని మా జాతిని నమ్మండి దొరా !

బాస్టి : నమ్మబట్టే రోడ్ల పనులిచ్చాం. కాని కనికరిస్తే కండ్లో కారం కొట్టే మీ జాతి కట్టడి కట్టింది — కట్టడి.

మల్లు : కట్టమా ! కండలు కరిగించి పొద్దల్లా పనిచేసిన కూలి జనానికి అరు క్కాష్ఠలిస్తున్నప్పిని నాలుగు కానులు చేతిలో పెట్టింట్రే. "ఇదేం దొరా !" అని అడిగినంత రక్తాలు కారేలా కొట్టిస్తిరే. జాగర్త మీరాటింది ఆట పాడింది పాటయ్యే రోజులు గతిస్తిని.

పిళ్ళె : గతి ప్తివి — మీ దినాలు

గంట : (గద్దించాడు) పిళ్ళే! యీ దొరల వలెనో వాళ్ల నీ చిత్తం వచ్చి నట్లు మాట్లాడుతున్నావ్ ?

స. ఇ. : నీ కి వలలో వీళ్ళ కి దొర్లించి పీకి పోసుకున్న నాటకం ?

మల్లు ; అవునలే దొరల మోచేతి నీళ్ళ రుచలా అనిపింపను.

పిళ్లె ; వాయిముడు,

మల్లు : నువు ముడు.

గంట : దొరా, నా మాట వినండి. ఈ భూమున్ని ముఠాదార్లకు కట్టబెట్టే యీ చట్టాన్ని రద్దు చేయండి. బట్వాడాలకు కోతపెట్టే ఈ అక్ర మాలను ఆపుచేయండి, మన్యానికో అన్నంముద్ద పెట్టండి.

బాస్టి : చాలించు నీ పెద్దమనిషి వేషాలు.

గంట ; (రెచ్చాడు) నోరు సంబాళించుకోండి.

బాస్టి ; ఆ! మళ్ళీ అను.

గంట : ఒక్కసారికాదు పెయ్యిసార్లంటా. జాగర్త. కొండను ఢీకొంటు న్నావ్. దోపిడీని సహించడం మా మన్యపు! మన స్తత్వానికే వ్యతిరేకం. చుట్టూ కొంపలు తగలడుతుంటే చూస్తూ ఊరుకునే స్వార్థానికి మా జాతి బానిసకాదు.

బాస్టి : డామిట్,

గంట : (గర్జించి) వేడినీళ్ళకు కొంపలంటుకోవ్. నీ బెదిరింపులకు మన్యం హడలిపోదు, పులినయినా పిలిచి చంపగల మా మన్యం మానసంలో పిరికికి తావుంటుందనుకోకు.

మల్లు ; పిలిచినా నా వస్తుపెట్టి పుల్లతో పొడిస్తివా, ఎగిరి పీక కొరకదను కోకుము.

బాష్టి : షటప్. (హంటరుతో కొట్టబోయాడు)

మల్లు : (ఆ చేయి పట్టుకొని) అయిందా ? ఇదిగో నా తడాఖా చూడు. (పిడికిలిఎత్తాడు)

గంటం ; (ఆ చేయి పట్టుకొని) మల్లూ తొందరపడకు. అర్థంలేని ఆవేశాలు అనర్థాలకు మూలం.

బాష్టి : అహ్హహ్హ నా చేతిలో అంగ అర్థబలాలున్నాయ్ – జాగర్త.

గంటం ? నీ అంగ అర్థబలాన్ని అంగలార్పించే కండశక్తి మాకుందని మరచిపోకు.

బాష్టి ; నా అంగబలానికి ఆయుధాలున్నాయ్. తెల్సా ? (పెళ పెళార్భటులు, ఓ పెద్దపులి ఘాండ్రింపు వినిపించింది, మల్లు తన వారనున్న బాకుదూసి ధైర్యంగా ముందుకొచ్చి నిలిచాడు, హడలెత్తిన బాష్టియన్ వొణకుతూ తుపాకీ గురిపెట్టాడు.)

రాజు ; (చేతిలో బెత్తముంది. పిడుగులా వారి మధ్య పడి వాడి చేతిలోని తుపాకి లాక్కొని) అహ్హహ్హ, ఎక్కడ నీ ఆయుధాలు? (అంత ఒక్కసారిగా ఫక్కున నవ్వారు.)

బాష్టి : నువ్వెవడవ్ ?

రాజు : నేనా ? నా పేరు అల్లూరి సీతారామ రాజు. తలుచుకుంటే నిన్నూ నీ అధికారాన్ని తృటిలో తృణంగా మార్చగల ఈ మహామానవుల మనిషిని, జాగర్త. వీళ్ళ కండశక్తికి అభేద్యమైన ధైర్యసాహసాలు కంచు కవచాలని తెలుసుకో, వీళ్ళు గర్జించే సింహాలైతే....

స. ఇ. ; మాకీ మొరిగే కుక్కల్కి హంటవ్ ? (అంతా నవ్వారు)

బాష్టి ; మాట్లాడుతున్నది ఎవరి ఎదుటో తెలుసా ?

రాజు : తెల్సు. ఒక జిత్తులమారి నక్క ఎదుట. దిక్కులేని పక్షులను పొడుచుకుతినే ఒక గుడ్లగూబ ఎదుట.

బాప్టి ; మాటలు మితిమీరుతున్నావ్?

రాజు ; మితిమీరి చరిస్తున్నది మీరు.

స. ఇ. : యీ దొరల్కి అలా చరించబట్టే యీ మన్నెపోళ్లు ఎఱ్ఱటి ఏగాడికీ చూస్తున్నార్. పెద్ద పెద్ద రోడ్లు వేయించి రెండు చేతులా పనికీ కడుపునిండా తిండ్కి పెట్టబట్టే వీళ్ళకూ పొగరూ హెచ్చించ్.

రాజు : (ఆవేశంతో చేతికఱ్ఱ విరిగిపోయింది) స్వదేశీయుడవై పోయావ్. యీ దొరలు రోడ్లేయిస్తున్నది మనకోసం కాదురా - మన్యం సంపదనంతా గతుకుల్లేని రోడ్లపై దొర్లించుకు పోడానికిరా మూర్ఖుడా. ఏ తల్లి కడుపున పుట్టావో ఆ తల్లి కడుపులోనే చేయి పెడుతున్నావా దుష్టుడా !

బాప్టి : (హంటరెత్తాడు) షటప్.

రాజు : దురహంకారీ.

గంట ; ఏమిటీ దౌర్జన్యం ?

మల్లు : ఏదీ చెయ్యేయ్.

బాప్టి ; (హంటరు విసిరాడు) ఇదిగో.

రాజు ; (అది తగలకముందే) ఏదీ ? (మణికట్టు పట్టాడు)

బాప్టి : ఆ....ఆ....ఆ....ఆ.... (మెలిదిరిగి హంటరును వొదిలేసాడు. అంతా నవ్వారు)

రాజు ; పో, ఇంకెప్పుడూ ఎదుటివానిపై చేయి విసరకు (పట్టుకున్న చేతిని విడిచిపెట్టాడు)

పిళ్లె : రంకీ సాక్ - పోదుము.

రాజు ; (కిందపడ్డ హంటరును బాస్టియన్ పైకి విసిరి) ఇదిగో ఇక వెను దిరిగి చూడకుండా పొండి.

బాస్టి ; (హంటరు పుచ్చుకొని పోతూ పోతూ) ఇదిగో గంటం నీ మున సబు గిరీ పీకేస్తున్నా. నీ ప్రవర్తన మార్చుకోకపోతే నీ భూముల్ హేండోవర్ చేసుకుంటాం జాగర్త (దురుసుగా పిళ్ళె ఇనస్పెక్టర్లతో వెళ్ళిపోయాడు. అంతా పక పక నవ్వారు)

రత్తి ; (రాజు కాళ్ళపై బడి) రామమూర్తిలా వచ్చింద్రు సోమీ.

రాజు ; (లేవనెత్తుతూ) కాదు, మీ దూతనేనమ్మా (గోవిందును చూచి అయ్యో ముందీ కట్లు విప్పండి.

గోవిం ; రచ్చిత్తిరి సోమీ.

రాజు : ఒకరు రక్షించేదేమిటి ? దౌష్ట్యానికి లొంగని ధైర్యం అన్యా యాన్ని ఎదిరించగల సాహసమే ప్రతి మనిషినీ రక్షిస్తాయ్. మీ ఆత్మశక్తి, సంఘటనశక్తే మీకు శ్రీరామ రక్ష. శిష్ట రక్షణకూ దుష్ట శిక్షణకూ ఆ రాముడెప్పుడూ పుడుతుంటాడు నాయనా.

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే.

(వెళ్ళిపోయాడు, కాసేపటికి అంతా కనులు తెరిచారు.)

అంతా : సోమీ. (ముందుకెళ్ళారు. రాజు కనబడలేదు)

మల్లు : మెరుపులా మెరసి మాయమై పోయిండే ?

గంట ; ఆశ్చర్యం. మనపై ఎంత దయ. ఎంత ప్రేమ! ఆహా వాళ్ల మాటల్తో బాప్టియన్ అంతటోడ్ని పరాభవించ గలిగిన ఆయన దెంత ధైర్యం ?

మల్లు : అరె పులిలా అరచి భీక భీక లెత్తించిండూ?

గంట ; ఈయనెవరో సామాన్య వ్యక్తికాదు. మన మన్యం పాలిటి మరో శ్రీరామచంద్రమూర్తిలా వున్నాడు.

గోవిం : బహు చోద్దెంగా వుంటిడే.

రత్తి : (తటాలున ఏదో స్ఫురణకొచ్చి) ఆ తెలిపిపోతది మామ !

గోవిం : ఏంటో తెలిపిందీ

రత్తి : మొన్న పేటకు సంతకు పోతిమి, గుడి వుంటిదికదా అక్కడ ?

గోవిం : ఉంటిదీ - నీలకంఠసోమి గుడి.

రత్తి : ఆ, అదే. ఆ గుడిలో ఓరో సోములవా రుంటిరని పోతిమి. మన గూడెం ఎంకికి ఎంచక్కా చెప్పింద్రు - చెయి చూసి.

గోవిం : ఓరు రత్తి.

రత్తి : ఈ సోములవారే.

మల్లు : జోత్యిషం చెప్పింద్రా.

రత్తి : నిక్కాం మామా. నీ మొగుడు మొనగాడై పోతడవగానే దాన్ని పట్టలేకుంటిమి మామా.

అంతా : (నవ్వారు)

గంట ; ఎంకి బ్రతుకుపై ఎంత నమ్మకం కలిగించారు!

మల్లు ; (ఏదో బుర్రలో మెరపి) ఆ ఇప్పుడు తేలిపోనాది!

గోవిం ; ఏంటంట ?

మల్లు : రాత్రిళ్ళు గూడేలు తిరుగుతూ కల్లు మాన్పిస్తుంటిరీ సోములు వారే నహో.

రత్తి : నిక్కం?

మల్లు : నిక్కం రత్తీ. అబద్ధమాడే గాచ్చారం నాకెందుకంట ? "వొల్లూ ఇల్లూ గుల్ల చేస్తది కల్లు" అంటిరి. దాని విషా యెక్కి మనిషి రాచ్చసుడై పోతడని చెప్పింద్రు.

గంట : నిజమంతే.

మల్లు : అదేంటన్నా ! ఆ మాటిన్నాక నానికి పెమాణం చేసి నేను కల్లు మానిన్ను

రత్తి : అందుకే మనిషివై తివి.

మల్లు : ముందు పశువునంటివా ? (అంతా నవ్వారు) హే నవ్వుతారేంటి? ఊళ్ళు ఊళ్ళన్నీ అంతుపట్టని ఆనందం చెందుతుంద్రు.

గంట : నరకాన్ని స్వర్గంగా మార్చేస్తున్నారు స్వామి.

రత్తి : కూడు ముట్టరు మామా, పళ్ళు, పాలే పుచ్చుకుంటరు. ఏం సత్తెము? ఏం తేజమనుకుంటిరి ?

గంట : ఆహా ! ఏ తల్లి కన్నదో ఈ పుణ్యపురుషుడ్ని, లోకం బాధనే తన బాధగా లోకాన్నే తన కుటుంబముగా ఎంచి మన్యం కోసమే ఇతడేతెంచి వుంటాడు.

రత్తి : అదుగో! మా మొహాయ్ సోములవారిటే వత్తుండు.

గోవిం : అల్లూరి సీతారామరాజుకీ ?

అంతా : జై ?

(సీతారామరాజు వచ్చాడు. ఆయన పాదాలకంతా ప్రణమిల్లారు. అందరినీ ఆయన లేవనెత్తుతూ.)

రాజు : మనం కావిన విముక్తి కోసం పోరాడుతున్నాం. ఏదీ అనండి స్వతంత్ర భారతకీ!

అంతా : జై !

రాజు : వొడలు పులకరించేలా....ధరిత్రి జలదరించేలా....ఏదీ మళ్ళీ ?

అంతా ; స్వతంత్ర భారత్‌కీ జై ! (శింగన్న ఆత్రుతతో వచ్చి ప్రక్కన నక్కాడు)

రాజు ) చూడం డతడెవరో?

అంతా : ఎవరది ?

గంట ; (ప్రక్కకెళ్ళి చూసి, శింగన్న చేయి పట్టుకొని తీసుకొని వస్తూ) ఓ శింగన్న మామా ! రా మామా, యిక్కడ భయం లేదు. వీను అల్లూరి సీతారామరాజు గారు. మన పాలిటి రాముడే రా భయం లేదు....ఇదుగో స్వామీ, ఇతడు మా శింగన్న మామ కర్మ కాలి ఆ కిరాతకుడైన బాస్టియన్ వద్ద వెట్టి చేస్తున్నాడు.

రాజు : ఏమిటీ, యీ కాలంలో యింకా వెట్టా ? తనుతినగా పది మందికి పెట్టగలిగిన శ్రమజీవే వెట్టి చేయడమా ?

శింగ : ఏం చేస్తాను సామీ ? నా పేనం - నా కొడుకు లాగరాయ పితూరీలో చచ్చిపోనాక........

రాజు : ఇంతకు ముందు పితూరీ జరిగిందా ?

గంట ; ఒకటా ? మూడు జరిగాయ్ నలభై ఏండ్లక్రితం తెల్లోళ్ళపై దండెత్తిన ద్వారబంధాల చంద్రయ్య పితూరీ తరువాత కనబడిన అధికారినల్లా నరికివేసిన కోయరాముడు పితూరీ. దాంతర్వాత సరిగ్గా ఆరేళ్ళక్రితం పొలం పుట్రా మందేనన్న లాగరాయ పితూరీ !

రాజు : ఓహో మన్యమే ఓ అగ్ని పర్వతమన్న మాట.

శింగ : ఆ పర్వతం పగిలే నా కొడుకు........

రాజు : తర్వాత?

శింగ : నా ఆడది బెంగతో మంచ మెక్కిండి. దానికోసం నా ఆరెకరాల పుట్రా నూరు దుడ్డుల కమ్మేసా. అపేవం దక్కలే అంతా ఐపో నాక యీ దొరదగ్గర ఎట్టి చేస్తుంటిని,........ దిన దినం కొట్టి కొట్టి వొదుల్తాందు సామీ. పీక పిసుక్క చద్దమనిపిస్తది.

రాజు : విచారించకు శింగన్నా విచారించకు. యీ మన్యం క్షేమం కోసం నీవక్కడ పులిమీద పుట్రలా వుండాలి. మాకు అక్కడి సమాచారం ఎప్పటికప్పుడు అందించావా చాలు!

శింగ : అందుకే యిప్పుడొస్తిని సామి. ఇంతకు ముందే ఎదురు తిరిగిండని పదాలు మామను ఖైదులో కుక్కిండ్రు.

గంట : పడాలునే?

శింగ : అవును మామా. ఇప్పుడిప్పు డెర్రబుట్టలోళ్ళు ఊళ్ళో ఇళ్ళన్నీ కూల్చేపిండ్రు.

మల్లు : ఎంత ఘోరం, ముందు చెప్పకపోతివే!

శింగ : ఇంకా ఘోరం చేపిండ్రు మామా. పాపం ఆ వీరిగాడి పెళ్ళాన్ని నడివీధిలో చెరిచిండ్రు.

రాజు : అమానుషం.

మల్లు : రాచ్చసులు.

రత్తి : సెలయి నిండుకున్న సీతమ్మనే!

శింగ : అవునమ్మా పేనాలు కూడా ఏటిపింది.

గంట : రామ రామ !

మల్లు : ఇంకా రామ రామంటావేంటన్నా. దొంగనాయాళ్ళని ఎగదేపి సరికెయ్యాలి.

గోవిం : అంతే మామా. దీనికి పెతీకారం సెయ్యాలి.

గంట : అవును చెయ్యాలి.

రాజు : అది మానవుని జన్మహక్కు కూడాను. తన గడ్డగాని గడ్డపై అడుగుపెట్టి ధోపిడీలకు దౌర్జన్యాలకు దిగిన యీ పెంతనాన్నిక దగ్గం చేయకపోతే మనకు బ్రతుకుల్లేవ్. పేదల పంచాయితీ రాజ్యం స్థాపన కాకపోతే మన శోకాలంతం కావ్.

గంట : నిజం స్వామీ నిజం.

మల్లు : పదండహె ముందు ఊళ్ళోకి పోదుము.

శింగ : అంలీళ్ళ నడుమంతరం పనులకే విరుగుడు చూడాలి సామీ!

గంట : మార్గం ?

రాజు : ఉంది. వీళ్ళ నంతమొందించే అన్ని మార్గాలూ మన కళ్ళముందే ఉన్నాయ్. బానిసత్వం కన్నా నీచమైన బ్రతుకింకోటి లేదని తిండి లేక చచ్చే బదులు పోరాడి చద్దామని ఇంటింటికీ పోయి ఉత్తేజ పరచాలి. మన్యంలో మొలత్రాడు కట్టిన మగోడల్లా బరిలోకి ఉరకాలి అంతే.

మల్లు : ఓ గేమగేమాలూ అందుకు సయ్యే.

శింగ : భద్రం సోమీ! మందూ మార్బలమూ వున్నోడు. కుంపిణీవోడు.

రాజు : మనమూ దాంతోటే ఢీకొంటాం.

గంట : అవి మనకెలా వస్తాయ్.

రాజు : (తుపాకిని తీసుకొని) ఇదెలా వచ్చింది ? అలాగే, అంతే తృటిలో యీ దొరలకు గతులూ, మతులూ లేకుండా చేయగలం. మూపున బిడ్డను కట్టుకొని స్వతంత్ర సమరం చేసిన ఝాన్సీ మనకో విప్లవ జ్యోతి. ప్రాణాన్ని తృణంగా త్యజించి శతపోరు సల్పిన చంద్రయ్య మనకు వెలుగుబాట. ఆ జ్యోతి కాంతిలో, ఆ వెలుగు బాటలో సాగినవానికి సాధ్యం కానిది లేదు. పదండి పోదాం. లింగన్నా నువ్వు ముందెళ్ళిపో. ఎప్పటి సంగతులప్పుడు మాకందించు - చాలు.

లింగ : శిత్తం సామీ ! (వెళ్ళిపోయాడు)

గంట : సామీ! ముందు పడాలును విడిపించాలి.

గోవిం : (రత్తి భుజంపై చెయ్యేసి) ఆ పని మేం చేత్తం మామా.

మల్లు : ఓ మా మొనగాళ్ళలా బయలుదేరు తుంటిరే ! ఆ యినస్పెట్టరుని అగ్గిదొరంటరు తెలుసా !

రత్తి : అడికి అగ్గెట్టే వొత్తుము మావ ?

రాజు : వాళ్ళని వెళ్ళనియ్ మల్లూ ? ఆ వెనకే మనమూ అక్కడకు వెడదాం పదండిక!

గంట : అల్లూరి సీతారామరాజుకీ !

రాజు : కాదు. స్వతంత్ర భారత్‌కీ !

అంతా : జై.

రాజు : (తుపాకిని గాలిలోకి కాల్చాడు) మ్రోగిందిక పీమ దొరల చావు గంట. కదిలిందొక పీడితజన జగన్నాధ రథం!

అంతా : ఉవ్వొంగి పొంగరా ఓ తెలుగుబిడ్డా !
భారత స్వాతంత్ర్య సమర రంగానా
పలనాటి చంద్రుని తెలుగు విక్రమదాటి
నాగులేటినాగ భుగభుగల పగ ఘాటు
రాణి రుద్రమ రౌద్ర రోషనల జ్వాల
నీ మహాశక్తిరా, శ్రీరామ రక్షరా !.... ॥ఉ॥
గోదావరీ పరుగు — కృష్ణవేణీ ఉరక
పర్వతాలే రగులు వన్య తేజముతో
దిశలెల్ల దుందుభులుదంధణా జై కొట్ట
తొడగొట్టి చేబట్టు జయము మొనగాడా ॥ఉ॥

(పిడికిలి బిగించి "జయము మొనగాడా" అంటూ ప్రతీ ఒక్కరూ వెళ్ళిపోయారు. రత్తి, గోవిందులు అక్కడే నిలచి "జయము మొనగాడా" అని ఆలపిస్తున్నారు).

# 2

(రాజమాహేంద్రి పోలీసుస్టేషను : ఓ ప్రక్క లాకప్‌లో పడాల్ మరో ప్రక్క రైఫిల్ స్టాండూ, మధ్య కుర్చీ. టేబిలూ టేబులుపై ఫైళ్ళు పులితలా వున్నాయి. గోడకో క్యాలండరు. బ్రిటిషురాజు బొమ్మా వ్రేలాడు తోంది. కానిస్టేబుల్ శరభయ్య రైఫిల్ స్టాండుకు అని కునుకుపాట్లు పడుతున్నాడు. రత్తి గోవిందులు నేరుగా వచ్చి చుట్టూ చూసారు ? ఎవరూ కనబడలేదు. ఆశ్చ ర్యంగా తమను చూస్తున్న పడాల్‌ను సమీపించి సైగ చేశారు. ఆ సైగతో శరభయ్య ప్రక్కను నిద్రపోతు న్నట్లు పడాల్ చెప్పాడు)

రత్తి : (శరభయ్య చెంతకెళ్ళి) ఏయ్ శరభయ్య దొరా. (పలకలేదు) ఓ శరభయ్య దొరా. (గాజులు గలగల్లాడించింది. పలుకలేదు)

గోవిం ; (రత్తి గజ్జెలు కదపగా పిలిచాడు) ఓ శరభయ్య దొరా.

పోలీ ; (త్రుళ్ళిపడి లేచి శాల్యూట్ చేశాడు.) సార్.

గోవిం : అహ్హహ్హ హాహాహా మేం దొరా. కోయదొరలం.

రత్తి : నాను రత్తిని దొరా.

గోవిం ; నాను గోవిందును.

పోలీ ; ఓరి వెధవాయ్ - నీ కింకా శాస్తి సరిపోలేదా ?

గోవిం అబ్బ దొరా, నీ దెబ్బలకు వొళ్లు హూనమైపోనాది దొరా.

పోలీ : మరేమనుకున్నావ్ — శరభయ్య చెయ్యంటే. (మీసాలు మెలి
(దిప్పుతూ) పట్నంలో పెద్ద పెద్ద రౌడీలకు మనమంటే హడల్.

పడాలు : అవునవును పెద్ద గాడిదవు కదూ, నీవు ?

పోలీ : అదే, అదే, దొర రానియ్.

పడాలు : అవునవును వాడో అడ్డగాడిద కదూ ?

గోవిం : వీడోటు దొరా, మా అఖండుడులా వుండడే.

పోలీ : (పొగడిపి) అఖండుడేలే. ఇప్పుడు మీరెందుకొచ్చినట్లో ?

రత్తి : నీ పేపకం కోసమే వచ్చుంటిమి దొరా.

పోలీ : ఆ అలా దారిలోకి రండి.

గోవిం : నీ బుద్ధి మాకు తెలుసు దొరా.

పోలీ : నా బుద్ధా ?

పడాలు : అదే - కుక్క బుద్ధి.

పోలీ : నోర్ముయ్.

రత్తి : ఆతగాడి జోలెందుకులే దొరా. నీకు మంచి ఇనాం తెస్తిమి.

పోలీ : అదిగదీ....ఏంటదీ.

రత్తి : నీకు దేనిమీద మనసు ?

పోలీ : అదే....అదే....(నాలుక చప్పరిస్తూ) నాకు తెలుసు మీరు తెస్తా
రని- అదిలేక పిచ్చెక్కి పోతుందంటే నమ్మండి.

గోవిం : పొయ్ రత్తి. దొర మా ఒమెక్కి పోతుండు.

రత్తి : పోత్త. మరెప్పుడూ మాపై చెయ్ వేయకూడదు.

పోలీ : ఒట్టు.

రత్తి : అయితే పట్టు : (కొద్దిగా నాలుకపై పోసి వాడు చప్పరిస్తూంటే దూరంగా వెళ్ళి ఊరిస్తూ........)

అదృష్టమంటె పీదెరా
ఆదెట్టులంటే ఓ దొరా

చింతపూలా చీరకట్టి
మధువు నింపిన బంగపట్టి
మోహినీ అవతారమెత్తి
వచ్చి నిలుచుందిర రత్తి.... ॥అ॥

మత్తుగా మధువుగోల
గమ్మత్తుగ ఉండుర వొల్లు
గిర్రున తిరిగి కనుల ముందర
వచ్చి నిలుచుండుర స్వర్గం.... ॥అ॥

చుక్క వేయ లంకాసురుడు
కైలాస మెత్తినాడంటర
గుక్క వేయ హిరణ్యాచ్చుడు
నేలను చాపగ చుట్టెనంటర ॥అ॥

ఊ: పట్టు దొరా :

పోలీ ; ఓ అమృతం.........అ....మృ....తం

గోవిం : దొరకి పొట్టనిండా పొయ్ రత్తి. (పోలీసుకు నిషా హెచ్చి వాలి పోతుండగా రైఫిల్ స్టాండు మూలకు నెట్టారు. రత్తి తాళాల గుత్తికై వాడి మొలను వెదికింది. కనబడలేదు. గోవిందు చేబిలు సొరుగును లాగాడు. దొరికింది. వెంటనే తాళాలు తెరచి

పడాలును బయటకు లాగి మరల తాళం వేసి సొరుగులో పడే
సాడు.

పడాలు : (గోవిందును కావలించుకొని) గోవిందూ ! ఆహా మీ రెంత ఉదాత్తులయ్యా. అపకారికి ఉపకారమన్న మాటను నేనింతవరకూ విన్నానేగాని ఇప్పుడు కళ్ళారా చూసాను. ఎంత సాహసానికి సిద్ధమై నన్ను విముక్తి చేసారు ? కాలు కాలుతుందని తెలిసికూడా నిప్పులో దుమికారే! నిజంగా మీరు త్యాగజీవులు. నేనేమి చేసి మీ ఋణం తీర్చుకోగలను.

గోవిం : మాదేముంది మామా, ఇదంతా ఆ గంటం మామ చలవ.

పడాలు : ఆహా ! గంటం. మన్యానికి సీవాక కొండవి _ ఏది ! ఎక్కడ గంటం ? ముందు నాకు చూపించండి. అతడి కాళ్ళపై బడి నా తప్పిదాలను క్షమించమని వేడుకోవాలి ?

రత్తి : అదంతా బయట చూత్తుము. శీఘ్రం పోదుము. పద మామా సోములువారు మనకోసం చూత్తుంటరు.

గోవిం : అవును పద పడాలూ !

పడాలు : ఎవరా స్వాములవారు.

గోవిం : ఏం చెప్పను మామ. అవతార పురుషుడనుకో.

పడాలు : అయితే మన మన్యం కష్టాలు గట్టెక్కాయన్న మాట.

రత్తి : తినబోతూ రుచెందుకంట ? చూద్దువు పద మామ.

పడాలు : పదండి.

గోవిం : అన్నట్టు సోములవారిచ్చిన మిరపకాయ టపా సంగతి మరచి పోతివే.

రత్తి : అవును మామోయ్. (బొడ్డులో దాచిన "అమ్మ"ను తీసింది. దాని కొనను ఓ చీటీ మిరపకాయతో కట్టివుంది, దాన్ని టేబిలుపై గుచ్చింది.) ఇప్పుడదిరిపోతడు — దొర, (ముగ్గురూ పకపక నవ్వుతూ ఫర్రున వెళ్ళిపోయారు. ఇనస్పెక్టరు తాపీగా వచ్చి బల్లకు గుచ్చి వున్న "అమ్మ"ను చూచాడు).

స. ఇ. : క్యా........బాణం. బహుత్ చోద్దెంగా వుందే! (దాన్ని లాగాడు) ఏ క్యా. మిరపకాయ! అరే మిరపకాయకి చిట్టి. (చీటీ చదివాడు) "నోటీస్....పట్టపగలు యీ స్టేషను మీదే దాడి చేస్తున్నాం. ధైర్యముంటే ఎదుర్కోండి" ఇట్లు అల్లూరి సీతారామరాజు. చచ్చాంరా హల్లా. (కుర్చీలో కూలబడ్డాడు. ఓ క్షణం గడిచాక) ఏడ్ టూ నాట్ టూ.

పోలీ : (నెమ్మదిగా లెప్పరిల్లుతూ) ఎవడ్రా నువ్వు - ఫూల్. పేరెట్టి పిలవలేవురా?

స. ఇ. : క్యా శరభయ్యా?

పోలీ : (మెల్లగా లేచి తూలుతూ) ఎవడ్రా శరభయ్య? నేను లంకా సురుడ్నిరా, కైలాస పర్వతాన్నే ఎత్తి పారేశానురా నువ్వెంత! నోర్మూసుక్కు పడుండు. లేదా....పీకపిసికేస్తా.... (ఇనస్పెక్టరు పైకి వెళ్లాడు)

స. ఇ : (తప్పుకొని) బద్మాష్ పోలీసు స్టేషన్‌లోనే త్రాగుడా?

పోలీ : అహహహహ దీని మజా నీకేం తెల్సురా హిరణ్యాక్షుడు తెలుసా, హాహాహా పాహేబువి - నీకేం తెల్సు పోరా - వాడు నేలను చాపగా చుట్టేసి సముద్రంలోకి విసిరేశాడు....ఏమనుకున్నావో. నేనుగాని గనక్సైతే కాకినాడకూ కల్లు సత్రంలు పెట్టించేద్దునురా....

స. ఇ. : ఛుప్‌రహో ఇడియట్. (చాచి చెంపపై కొట్టాడు)

పోలీ ; (నిషా దిగింది. వొణుకుతూ) సార్! క్షమాకరో సార్! నిషాలో ఏమేమో అనేసాను సార్ !

స. ఇ : అచ్చా క్షమాకియా హివి సీకీ ఫస్టు వార్నింగ్. ఇంకొకసారి ఇలా చేశావా, డిస్మిస్. ఖబడ్దార్. ఆ! డ్యూటీ దిగిన కానిస్టేబుల్సు కహా ?

పోలీ : అందరికీ సెంట్రీ డ్యూటీ వేసాను సార్.

స. ఇ ; హేడవలేకపోయావ్ — ఒకడ్ని రప్పించి స్టేషన్‌కీ గస్తీవేయించు

పోలీ ; ఏమి సార్,

స. ఇ ; హిదిగో దేఖో. (నోటీసు చేతికిచ్చాడు.)

పోలీ ; (చదువుతున్నాడు. దడ పుట్టింది) పట్టపగలు ఈ స్టేషను మీదే దాడి చేస్తున్నాం. ధైర్యముంటే ఎదుర్కోండి. ఇట్లు....ఇట్లు.... సీతారామరాజు.....దాడి....దాడి. (గుర్రిడ్లు తేలేసాడు).

స, ఇ ; (పట్టుకొని గింజాయించి) ఏయి. టూనాట్ టూ శరభయ్యా. ఓ బహుత్ ముష్కిల్ ఆయా. (టేబిలుపై ·పైలుతో విసిరాడు) ఉఠో బద్మాష్. లేవనెత్తి ఛలో జల్దీ ఛలో పిరికి పీనుగా.

పోలీ : అచ్చా శాబ్ (వెళ్ళబోయాడు.)

స. ఇ ; హెక్కడికి ?

పోలీ ; అవును — ఎక్కడికి సార్ ?

స. ఇ ; కాటికి. ఇడియట్. నోటిమాట జారిందో లేదో అప్పుడే తుర్రున పరుగు. హిదిగో దేఖో. నీవు జల్దీగా సర్వీపట్నం వెళ్ళి—ఆ— (బుర్ర గోక్కుంటూ)—ఆ

పోలీ ; (పలుకలేదు)

స.ఇ. ; నోటిలో హేమి పెట్టుకున్నావోయి _ కొయ్యలాగ.

పోలీ ; ఏంటి సార్ ?

స. ఇ. : ఏడిసావ్ _ వెధవసారూ నువ్వూనూ! వెళ్ళు ఫస్టుబస్‌కి జల్దీగా వెళ్లు. వెళ్ళి రెండు లారీల రిజర్వు పోలీసులను తక్షణం లే ఆవ్

పోలీ : అచ్చా సాబ్ (వెళ్ళబోయాడు)

స. ఇ ; హిదిగో.

పోలీ : (ఆగాడు)

స. ఇ. ; హిక్కడ సూపర్నెంటు దొరతో _ మొన్న పితూరీదార్లు చింత పల్లి స్టేషన్ కొట్టేశారని. రాజవొమ్మంగికీకూడా కొట్టేస్తారని.... (కంగారుపడి) .... నహీ .... నహీ .... కొట్టేస్తానన్నారని .... బోలో. ఆ. ఒక్కొక్కసారి పులిలా గాండ్రిస్తారనీ....నాన్సెన్స్ ఘాండ్రింపడమేమ్టి ? పులిలా హైపోతారని బోలో, ఊ జావ్ !

పోలీ ; (వెళ్ళబోయాడు)

స. ఇ. : హచ్చా _ హంతవాయ్. చిట్టి రాపిస్తా....(టేబిలు సొరుగునుండి తెల్లకాగితం తీపి ఏదో రాపి పోలీసుకిచ్చి) హిదిగో హిక్కడ ఉన్నట్లు రావాలి సుమా....

పోలీ ; (ఉత్తరాన్ని పుచ్చుకుంటూ) అచ్చా సాబ్.

స. ఇ. : హాలస్యం చేస్తే ?

పోలీ : అవును సార్ మెడకాయపై తలకాయ....?

స.ఇ. : ఆ. అభీ ఛలో.

పోలీ : (వెళ్ళాడు)

స.ఇ. ; హరే, హల్లా ! (కుర్చీలో కూర్చుని ఓ క్షణమాగాక తటాలున గుర్తువచ్చినట్టు (త్రుళ్ళిపడి) అచ్చా హిప్డూ హీ లాకప్‌లోని

బద్మాష్ సంగతీ తేలుస్తా ! (లేచాడు) ఆ, క్యా పడాల్ ?........ (చూసాడు లాకప్ ఖాళీ) క్యా అరె తాళంకీ వుంది. లోపలికీ మనిషి లేద్.... (పేటిలు సొరుగులో తాళంతీసి. లాకప్ తెరచి చూసాడు. ఎవరూ లేరు) హెంత సాహసం ? హీ హగ్గి దొరకీ హయాంలో గైర్ హాజర్ ? కహాఁగయా, పడాల్?....కానిస్టేబిల్స్....(బయటికి వెళ్ళబోయాడు)

రాజు : [గొల్లవాని వేషంలో గడ్డిమోపుతో వచ్చాడు. ముక్కుకు కాడా, చెవులకు పోగులు, వెనుక శిగ గడ్డం, నోటిలో పెద్దచుట్ట చేతిలో కర్ర వుంది] ఏం దొరోయ్ — చిటపటలాడుతుంద్రు.

స.ఇ. ; తూ, కౌన్ హై ?

రాజు ; నే నెరికనేదేంటి దొరా, నేనే మీ బానిసోడి తమ్ముడ్ని.

స.ఇ. ; ఆ గడ్డం హేంటిరా ?

రాజు ; [మోపుదించి గోముగా] ఇదా, భద్రాద్రి రామయ్య మొక్కు దొరా?

స.ఇ. : నీ హన్న రాలేదేం?

రాజు : వాడొల్లు అగ్గిలా వుండాది దొరా.

స.ఇ. ; మరి తేనెకుండ తెస్తానన్నాడ్ ?

రాజు : ఇచ్చిండు దొరా. నాను ఇంటికాడ తమమ్మోరి కిచ్చిఋన్ని.

స.ఇ, ; క్యాబోలా ? — గాడిద.

రాజు ; అవును ఇచ్చిఋన్ని దొరా.

స.ఇ. ; హీ స్తై హమ్మోరంటావురా బద్మాష్.

రాజు : అదా ? మా వాడుకలే దొరా.

స.ఇ, ; పరేగాని హమ్మగారికి కంచె కోడిమాంసంపై పోయిందిరా.

రాజు : అబ్బో అది మా చెడ్డకట్టం దొరా. మన్నెపోళ్ళకి ఆదంటే మా మక్కువ. ఏం ? అమ్మోరికి మేకపోతుపై పోనేదా ?

స. ఇ. : ఏమి కూసావు పూల్?

రాజు ; అబ్బో కోప్పడుతుంటిరే. మేకపోతుని తేవడం బాలా తేలిక దొరా. ఆంచుకని అంటివి.

స. ఇ. ; అదా ? ఎలాగూ మీ మన్నెపోళ్ళు తెలివి మీరారులే చర్మం వొల వాలిచే మీకు ——— అబ్బా. తూ—జా. (లాకప్ వొంక చూసాడు)

రాజు ; వన్ను బొమ్మని ఆ పంజరం వొంక చూ స్తవేం దొరా పక్షిలే మైనా ఎగిరిపోతివా ఏంటి?

స. ఇ. ; ఓరి పిడుగా, ఊరుకున్న కొద్దీ నీ హెవ్వారం ముదురుతున్నదే ? జా బే జా?

రాజు ; పోదునూ మరి మేకపోతు యవ్వారం తేలి స్తిరి కాదే ?

స, ఇ. ; బావ్‌రే బావ్. నీకీ మేకపోత్కి ఒక్క సలాం - జల్దీ జాబేజా,

రాజు ; అదేంటి దొరా అలా బెదిరిపోతుంద్రు ?

స. ఇ. : సీతారామరాజు దాటికొస్తున్నాడు - జాబే జా.

రాజు ; ఏందీ, ఆ పితూరీ రాజుగోరా? అహాహాహా. నానిప్పుడు చూపిణ్ను? వాగుదగ్గర నీళ్లేసుకుంటుందే,

స. ఇ. : ఏడిసావ్ జా జా.

రాజు : నిజం దొరా. అయినా రాజు గుంటడులా ఉంటడే చేతికర్ర కూడా నేదూ? అ గుంటడుకోసం బయటందరు జవాన్లెందుకు దొరా ?

స, ఇ. : చుప్ ముందు బయటికి పోవే.

రాజు : ఏం దొరోయ్. మాటలు మాలావుగ విసిరేస్తుంటిరే.

స. ఇ. ; రాస్కెల్, ముందు నీకి బయట్కి పోతావా, పోవా ? (మెడపట్టి గెంటబోయాడు)

రాజు : చేయి చేసికుంటుంద్రేః

స. ఇ. ; షటప్ః

రాజు : షటప్పా ?

స. ఇ. ; తూత్, ఇడియట్ ? (కొట్టబోయాడు.)

రాజు : (నిజరూపం చూపి, తీవ్రంగా) ఆగు.

(బయట "అల్లూరి సీతారామరాజుకీ జై" అని నినాదాలు)

స. ఇ : రాజు. సీతారామరాజు (పిస్టలుతీసి కాల్చబోగా బయటనుండొక బల్లెం వాడి గుండెలపై ప్రత్యక్షమైంది. చేతిలో పిస్టల్ క్రిందకు జారిపోయింది)

మల్లు ; అహ్హహహ్హా, నూరు గొడ్లనుతిన్న రాబందు ఒక్కదెబ్బకు సఫా. (బల్లెం దించుతూ వచ్చి తీవ్రంగా) తియ్ — పిస్తోలు.

స. ఇ : (వొణకుతూ తీసాదు)

మల్లు : ఇయ్ — రాజుగోరికి.

స. ఇ : (ఇచ్చాడు)

మల్లు : జాగర్త. జవానులు బయటున్నారనుకోంటివేమో వాళ్ళప్పుదే కాళ్ళకు బుద్ధి చెప్పింద్రు.

రాజు ; వొదిలిపెట్టారా ?

గోవిం : (తుపాకితో వచ్చి) పడాలు తరుంతున్నాడు (అనేపి ఎదుట పైని కునిలా పహరా ఇస్తున్నాదు)

రాజు : బేష్, పడాల్ ప్రతీ ఆంధ్రుడికీ — ఆదర్శప్రాయుడు.

గంట ; (కంగారుగా వచ్చాడు. విల్లమ్ముల్లూ, గంగ్రదగొద్దలి ఉన్నాయ్. జబ్బ పట్టుకొని మీరొచ్చేయండి.

రాజు : [మందహాసంతో] గంటం ? జీతం రాళ్ళకు పనిచేసే పోలీసుల కంత పసెక్కడనుండి వస్తుందయ్యా ?

గంట ; (సబ్ ఇనస్పెక్టరును చూచి) ఏం అలా, వొణికిపోతున్నావ్ ? తోడేలులా గ్రామాలపై బడి జనాన్ని వేధించుకుతిన్నట్లు లేదే ?

స.ఇ. ; మాఫ్‌కరో నాకీ అలా....

మల్లు ; ఇంకను బొంకుతుంటివే ?

రాజు ; ఏదీ నీ స్టేషను రికార్డు ?

స.ఇ. ; అచ్ఛా హుజూర్! (తీసి యిచ్చాడు)

మల్లు ; [స్టేషన్ కలియజూచి) హూ, రాజరికం ! [బ్రిటిషు రాజు బొమ్మను పీకేసాడు]

రాజు ; [చుట్టూ చూచి] తుపాకులూ తూటాలూ ఎక్కడ ?

పడాలు ; [విల్లమ్ముల్లూ, మొలను బాకూ, చేతబల్లెం, భుజంపై తుపాకులూ సంచి వున్నాయ్, తుపాకులు ముందు పారేసి] ఇవిగో ఇవిక్కడెందుకుంటాయ్ ? మనల్ని కాల్చడానికి ముందే పోలీసుల చేతుల్లో పెట్టాడు. ఏడుపనాయలకిచ్చా, యీ నాలుగూ మనకు. (సంచి ముందు పడవేసి] ఇవిగో. తూటాలు !

గంట ; [మూటవిప్పి తూటాలు తీసి] అన్నమో రామచంద్రా అని అఘోరించే ఆకలి జీవుల కిదా అన్నం ?

మల్లు ; ముందు పీన్ని పొడిస్తే: [బల్లెం ఎత్తాడు]

రాజు ; మల్లూ మరచిపోయావా ? మన శత్రువు తెల్లవాడు. యీ తుపాకులూ, తూటాలు లేకపోతే వాళ్ళు మన దేశాన్నొక్క-

క్షణం పాలించగలరంటావా ? పిచ్చోడా, ఎవడు తిండి పెడితే వాడి పక్షాన పనిచేసే ఈ పోలీసు లేంచేసారోయ్?

స.ఇ. : ఠీక్ కహా. హుజూర్,

రాజు : హు, నిజం ఏది నిజం ? నీ వాంధ్రుడవై యుండి కూడా అధికార మదంతో అరమరికలేని ఈ అమాయక అనాది జాతిని అణగ ద్రొక్కుతున్నది నిజం కానిసగా అమ్ముడుపోయి. వీసమైనా జాలిలేని కసాయి దొరలకు తెలుగు సంపదను ధారాదత్తం చేస్తున్నది నిజం. (గద్దించి) కాదంటావా ?

స. ఇ ; హెలా హంటాం ?

మల్లు : పురుటి నొప్పుల కబుర్లు,

స. ఇ. : నహీ, నహీ, నిజంకీ చెబుతున్నా హుజూర్.

రాజు ; నిజం విజానికి నీకూ చాలదూరం. నీ నిజం వీళ్ళకు బాగా తెలుసు పో! నల్లవాడివై పోయావ్.

మల్లు : వీడు మన్నెంలో చేయని పాపంలేదు. ఈ కలుపు మొక్కల్ని వేరెయ్యకపోతిమా మన్నేనికే నష్టం రాజా !

రాజు : ఇతడి పాపం ఇతడ్నే తినేస్తుంది, ఇతడు దొరలచేతిలో కీలు బొమ్మ. అసలు మనం దొరల్ని వేరెయ్యాలి.

గంట ; అవును మల్లూ, స్వామి చెప్పిందే సత్యం. (ఇనస్పెక్టరును చూచి) సరే! రాజుగారి పేరు చెప్పుకు పో.

స, ఇ ; అచ్చా గంటందొర, అల్లూరి సీతారామరాజుకీ జై !

మల్లు : ఛా! ఆ పేరెత్తకు, ఎత్తి ఆ పేరుకే మచ్చ తెస్తువు.

స. ఇ. ; అచ్ఛా సలాం (వడ్రున పారిపోయాడు)

మల్లు : దొంగనాయాళు.

పడాలు ; మరి చెట్టుకు కట్టబడ్డ పోలీసుల సంగతి ?

రాజు ; విడిచిపెట్టు "ప్రజల వొంటిపై చేయి పడిందా — జాగర్త"ని హెచ్చరించు. (పడాలు వెళ్ళాడు, బయట "అల్లూరి సీతారామరాజుకీ జై!" అని నినాదాలు, అంతా అటు చూసారు)

మల్లు ; ఎదుటికెళ్ళి చూసి) అబ్బ ఎంత జనం ? ఇసుకవేస్తే రాలనంత మంది.

గంట : రాజా, ఇప్పుడు మీరు మన్యానికి మకుటం లేని మహారాజులు! ఈ గద్దె నధిష్టించండి (కుర్చీవేసి) చూడండీ రికార్డు.

రాజు ; (రికార్డు అందుకుంటూ) యీ పోలీసు రికార్డు చూసేదేముందిలే గంటం — లంచాలివ్వని మన కోయల్ని పెట్టే హింసలేగా. ఈ రికార్డు ! (చూచి) చూచావా ? మన పడాలు దొరతనం డబ్బు ఎగ వేసినందుకు లాకప్ చేసినట్టు సృష్టించారు.

గంట : సిచులు.

గోవిం ; నేనంటినే — పీళ్లొట్టి శవాలపై పేలాలేరుకుతిమ రకమవి?

మల్లు ; అందుకే చావు తప్పి కన్నులొట్ట పోతివి — వెధవనాయాళ్ళకి.

పడాలు : (వచ్చాడు) మీ దర్శనానికి ప్రజలెదురు చూస్తున్నారు రాజా !

రాజు ; దర్శనం. ముందీ రికార్డును దర్శించమను. (ఎదురువెళ్ళి) నాయన లారా ! (బయట అల్లూరి సీతారామరాజుకీ జై ! నినాదాలు) మన

కిప్పుడు కావలసినవి నినాదాలు కాదు. చేతలు. మనల్ని అధోపాతాళానికి అణగద్రొక్కి నెత్తికెక్కి నాట్యం చేసే దొరల పరిపాలన నంతం చేయాలి. మూడుపువ్వులారు కాయలుగా నున్న మన కుటుంబాల్ని కూల్చి చీటికీ మాటికీ లంచా లివ్వలేదని చీకటి కొట్టులో క్రుక్కి చావబాది బాధించే సీమదొరల పీడ వొదిలించుకోవాలి. నరుడు తలచుకుంటే నల్లరాళ్ళేకాదు — ఉక్కు పర్వతాలైనా చెక్కముక్కలై తీరుతాయ్. దొరల కాయువు పట్టులైన పోలీసుస్టేషన్లను చుట్టుముట్టండి, తుపాకులను కొల్లగొట్టండి. పదండి — మరో స్టేషనుపైకి! గంటం రేపీపాటికి మరో స్టేషన్ కొట్టాలి. పదండి!

పడాలు : ఆగండి నేడు పితూరీకి పవిత్రదినం. ఈ చిహ్నంగా ముందుకు సాగుదాం. (అంతా "మన్యం పితూరీకి జై" అంటూ తుపాకులు కాల్చారు. బయట నినాదాలు మిన్నుముట్టాయి)

లింగ : (ఆత్రుతగా వచ్చి) సామీ! ఇంతవరకూ మా మన్నెంలో జరిగిన పితూరీలన్నిట్నీ మరిపిస్తుంటివి. కాని—

గంట : కాని?

లింగ : మొన్న మీరు చింతపల్లి కచేరీ కొట్టిపోరని తెలిసిపోనాక బాస్టియన్ దొర నర్సీపట్నం నిండా జవాన్లని దించిందు. జయపురం సంస్థానం నుంచి ఏనుగులు కూడా వచ్చాంటివి.

మల్లు : అవెందుకో?

లింగ : మనుషుల్ని పట్టిస్తుదట మల్లు మామా !

రాజు ; నర్సీపట్నం నుండి మనకు తాజా సమాచారం కావాలి. అది చాలా ముఖ్యం. అర్జంటు కూడా.

లింగ ; ఆ సమాచారం నేనందిస్తును మీరు ముందీశ నుండి తప్పుకోండి, సామి, బాస్టియన్ ఈడకొస్తూ కచేరీలో ఇనస్పెక్టరుంటిడో లేదో చూసి రమ్మని ముందు నన్నంపిండు,

రాజు : సరే లింగన్నా నువ్వెళ్ళు భద్రం. మన్యమే నీ గుప్పిట వుంది సుమా.

లింగ : అది నాకు తెలియకపోనాదా? నేను వెడుతును. మీరీడనుండి తొందరగా తప్పుకోండి. మీ సేమం మా మన్నెం సేమం. సామీ (వెళ్ళిపోయాడు)

రాజు ; మనమూ పోదాం పదండి.

మల్లు : బాస్టియన్ ఇక్కడకే వస్తున్నాడంటిడే, ముందు వాడి పనిక్కడే తేల్చి పేత్తము.

గోవిం ; అవును వాడంతిక్కడే తేల్చుదాం.

రాజు : కాదు మనమింకా బలం పుంజుకోవాలి గోవిందూ.

మల్లు ; ఏడికాడు - నల్లిని నలిపేసినట్టు నలిపేయనా అంట.

గంట ; మల్లూ ఆ ఆవేశమే తగ్గించుకోమంటున్నా,

పడాలు ; ఆయితే ఆలస్యమెందుకు పదండి.

గంట : అవును ఆలస్యం అమృతాన్ని విషంగా మారుస్తుంది.

పడాలు ; అత్రోవని క్రిష్ణదేవుపేట వెళ్ళి ఆ జనంతో గాముకొండ చేరితే ?

మల్లు ; ఎట్లా ?

రాజు ; అవును, ఇదీ మంచి ఆలోచనే. మనం విన్ననుకున్న కాళీపూజ సంకల్పమూ సిద్ధిస్తుంది. అక్కడే మన దళాలను సమాయత్త పరచి, వాటికి పోరాట శిక్షణా ఇవ్వొచ్చు.

గోవిం : బావుంది – ఒక దెబ్బకు రెండు పిట్టలు.

పడాలు ; మీదెంత లోతైన ఆలోచన ?

గంట ; లోతులోనే నీళ్ళుంటాయ్.

రాజు ; ముందు పదండి పడాలూ. నీవు, మల్లూ, గోవిందూ ఒక దళంతో వెళ్ళి క్రిష్ణదేవుపేట స్టేషన్ను కొట్టండి. నేనూ గంటం మరో దళంతో వెళ్ళి అడ్డతీగెలపై దాడి చేస్తాం. మీరు అక్కడి జనంతో గాముకొండ చేరేసరికి మేమూ అడ్డుగా వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాం.

మల్లు : ఇంకోలా చేస్తైనో ?

గంట : ఇంకెలాగూ లేదు. రాజుగా రగ్గిలో దూకమన్నా దూకవల సిందే.

రాజు : పడాలూ, బయట మన దళాలు సిద్ధంగా వున్నాయా ?

పడాలు ; (చూసొచ్చి) ఓ. పదండి.

గోవిం ; మన్యం పితూరీకీ....

అంతా ; జై.

రాజు : స్వతంత్ర భారత్‌కీ....

అంతా : జై!

బాధితులగు జీవులార.
బానిసలగు దీనులార.
దాస్య బంధనాల త్రెంచ
ఏకమై పదండిరా!
పదండిరా ? పదండిరా, పదండిరా.... ॥బా॥
తరతరాల దాస్యముతో
కరిగిపోయె మన తనువులు
యుగ యుగాల పీడనచే
ఉడిగిపోయె మన శక్తులు.... ॥బా॥
మూగజీవితమును వీడి
ముమ్ముందుకు సాగిరండి
గాండీవము చేతబట్టి
కదనానికి కదలిరండి ॥బా॥
దౌర్జన్యం సాగదవి
దారిద్ర్యం పొసగదవి
దిగ్దిక్కులు కంపించగ
ఐక్యకంఠ వినాదాల
జై జై అని సాగరా........ ॥బా॥

("పదండిరా" అని ఒక్కొక్కరే ఆలపిస్తూ వెళ్ళిపోయారు.)

శింగ : (వచ్చాడు) అమ్మయ్య. పిట్టలెగిరిపోతివి. లేకపోతే వాటి నెత్తురు కళ్ళ చూచును — యీ బాప్టియన్ దొర. (బయట అలి కిడి. కాస్త ముందుకెళ్ళి చూసాడు)

బాప్టి : (మిలటరీ యూనిఫారంలో చకచక వచ్చి) శింగన్నా.

శింగ : శిత్తం.

బాప్టి : నే నొస్తున్నానని యస్ప్రెరి చెప్పమని పంపితే ఇంకా ఎక్కడేడు స్తున్నావ్ ?

శింగ : ఈడనే వుంటివి దొరా.

బాప్టి : ఏడీ యస్ప్రె ?

శింగ : లేదు దొరా.

బాప్టి : చూడు సరిగా. ఏంటిదంతా ? చాలా గందర గోళంగా వుంది.

శింగ : ఏమో దొరా ఈడేదో కాగితముంటిది చూడు దొరా. (క్రింది నున్న కాగితం తీపిచ్చాడు)

బాప్టి : (చదివి) వాట్, యెంత సాహసం ? త్రొవనబోయే జవాన్లని దోస్తున్నారు. స్టేషన్లు కొల్లగొడుతున్నారు, చూడు యస్ప్రె ఎక్కడో ?

శింగ : వెతికిణ్ను దొరా ఏడను కానలేదు.

బాప్టి : బయట క్యాంపులో ఉన్నాడేమో చూడు.

శింగ : శిత్తం (వెళ్ళాడు)

బాప్టి : చించేసిన ఫోటో, కాశీ తుపాకుల స్టాండూ, రికార్డులేవి తీసి వున్న బీరువా, అందులో తాళాలు చూపి లాకప్ వైపు నడి చాడు) టెరిబుల్ తాళం, తాళం లాగునే వుంది లోపల పదాల్ పరార్.

స. ఇ. : (నక్కుతూ నక్కుతూ వచ్చాడు)

బాస్టి : స్కౌండ్రల్స్ (బిల్లగుద్దాడు)

స. ఇ. : (త్రుళ్ళిపడ్డాడు) మైహూ సాబ్. (ఎటెన్షన్‌లో నిలిచాడు)

బాస్టి : ("చక్" మని తిరిగి) ఓ నీవా, ఇంత పిరికిపందవా ?

స. ఇ. : హక్కడికి చాలా గార్డుకి ఉంచా సాబ్! ఒక్కసారిగా విరుచుకు పడ్డారు సాబ్. పితూరీదార్లు.

బాస్టి : ఊళ్ళో క్యాంపు కెందుకు కబురు చేయలేదు?

స. ఇ. : రిజర్వు హిక్కడలేదని కబురు నర్సీపట్నం భేజ్ దియా సాబ్

బాస్టి : కబురు, కబుర్లతో కాయలు రాల్తాయనుకున్నావా స్టుపిడ్. సరే గార్డేది ?

స. ఇ. : పితూరీదార్లు ముట్టడించరాగానే పారిపోయార్ సార్.

బాస్టి : (తీవ్రంగా) ముట్టడించాక నీవు పారిపోయావ్, ఏం ?

స. ఇ. : నాకీ తమ క్యాంపుకో ఆయా సాబ్?

బాస్టి : వచ్చి?

స. ఇ. : (ఒక కవరు యిస్తూ) హక్కడెవరో మిలటరీ ఆఫీసరు....

బాస్టి : మిలటరీ ఆఫీసరా ?

స. ఇ. : హావును సాబ్. హక్కడున్న మనకి సార్జంట్ మీకీ హిమ్మని దీన్ని హిచ్చాడు సాబ్, బహుత్ జరూర్‌కా బోలా.

బాస్టి : (చిరాకుగా) ఊ (సబ్ ఇన్‌స్పెక్టర్ చేతిలోని కవరు లాక్కొని చించి చూసి) ఓ మైగాడ్! గుడాల్ మన చీఫ్ కమాండరా ? వచ్చాంరా నాయనా. ఇప్పుడు తిండి తినడానికి తీరిక లేకపోతే రేపు నీళ్ళు త్రాగడానికూడా కుదరదన్న మాట.... (కుర్చీలో కూలబడ్డాడు)

స. ఇ. : (ఆ ప్రక్కకు వెళ్ళి) కౌన్‌సాబ్ హోయన?

బాప్టి ; పరల్డ్ వార్‌లో పాల్గొన్న ఘటికుడు.

స. ఇ. ; అచ్ఛా అటువంటాయన ఉండాలి సాబ్.

బాప్టి ; ఎందుకు ?

స. ఇ. ; నైతో యీ పితూరీమూకల నణచలేం సాబ్.

బాప్టి ; నాన్సెన్స్. చేతకాకపోతే సరి........

స. ఇ. : హుసల్ విషయం బోలో సాబ్.

బాప్టి ; ఏముందీ మొన్న నర్సీపట్నంలో కమాండర్ "నాఫ్" నాయకత్వాన మిలిటరీ ఆఫీసర్ల సమావేశం జరిగింది. అందులో పితూరీ నణచడానికి ప్లాను వేశారు....

స. ఇ. ; వేశార్. సమయానికి హచ్చా చిట్టి వచ్చింది సాబ్. హీ దెబ్బతో పితూరీకి పునాదుల్తో పెరికి పసిఫిక్ సముద్రములో పడెయ్యొచ్చు సార్.

బాప్టి ; పశ్చాత్తాపుగా పెద్దమ్మది.

స. ఇ. : క్యాకర్నా సాబ్. - ఒకటి, మన ఆఫీసర్లేం లేల్చారో బోలో సాబ్.

బాప్టి ; సరి విను. ఒకటి - ప్రజల్లో పితూరీకి బలముంది.

స. ఇ. ; ఉంది కదండీ ?

బాప్టి : (కోపంతో వ్యంగ్యంగా) లేదంటానంటి ! (తీవ్రంగా) వినండి. అందుచేత ప్రజలపైనే దాడి చెయ్యాలి.

స. ఇ. : అంతేసాబ్. నైతోసాబ్. ఎవడ్ని త్రోవడిగినా ముక్కుతు తిన్నగా పొమ్మన్నవాడే సాబ్.

బాస్టి ; పే, ఎెక్షెన్ : రెండు _ పితూరీ గుట్టంతా మన అరచేతనుండా అంటే వైర్‌లెస్ అరెంజి చేయాలి.

స. ఇ. ; చెయ్యాలి సార్? హడేటి సాబ్ హవి లేక నేను రిజర్వు కోసం మనిషిని పంపేగతి పట్టింది సార్. చేతులు కాలాక మూతులు తడుంకుంటే ప్రయోజన మేంటి సార్?

బాస్టి ; గొప్పవాడివిలే విను మూడు _ ఆంధ్రదేశమంతలో పితూరీకి అఖండ సానుభూతి వుంది....

స. ఇ. ; వుంది కదండీ ?

బాస్టి : అందుకే ఆంధ్రాభిమానం వున్న ప్రతివాడ్ని సైన్యం నుండే రెయ్యా లన్నారు.

స. ఇ. ; అదేంటి సాబ్, మనమంతా ఆంధ్రులమేగా ?

బాస్టి : అదా పిచ్చోడా : మనలాంటి ఒబీడియన్ట్ సర్వెన్ట్సును కాదోయ్.

స. ఇ. అచ్చా అలా బోలో సాబ్, ఏమైనా ఈ పితూరీని అణచాలంటే మన రిజర్వుఫోర్సు చాలదు సార్ .

బాస్టి : అందుకే అస్సాం, మలబారు గూర్ఖా పటాలాలు కూడా దిగుతున్నాయి ?

స. ఇ. ; ఓహో, బహుత్ హచ్చాసార్.

బాస్టి ; అంతేకాదోయ్! ఆఫ్రికా, ఆఫ్ఘన్ ఏడెన్ యుద్ధాల్లో కాకలు తీరిన కవర్దు, హైటరులు కూడా దిగారు.

స. ఇ. ; అవి హెడారు లనుకుంటాను సార్ ?

బాస్టి ; అవును.

స. ఇ. ; మనవి హడవులుకదా సార్ పనికొస్తారా అని ;

బాస్టి ; ఓ, పూల్.

స. ఇ. ; (రంగుమార్చి) హదికాదు సార్. బ్రిటిష్ ఆర్మీకూడా వొచ్చేయ వాలి సార్.

బొస్టి ; అహాహాహా ! బ్రిటిష్‌గవర్న్మెంటు ట్రిక్స్ నీకేం తెలుసునోయ్! ఆంధ్రేతరజాతుల్ని ముందుపెట్టి పైన వాళ్ళు కమాండ్ చేస్తారు. బయట కారు హారన్, తనూ సబ్ ఇనస్పెక్టరు అటు చూసారు)

పిళ్ళై ! (హడావుడిగా వస్తూ) సార్....సార్....సార్.

బొస్టి ; ఏంటా సార్.

పిళ్ళై : పెరియదొరదా వందొచ్చా సార్.

స. ఇ. ; హనగా ?

పిళ్ళై : కమాండర్ ఇన్ ఛీఫ్‌దా సార్ ?

బొస్టి ; గుడాలే ?

పిళ్ళై : అమా సార్. చింతపల్లి, రాజవొమ్మంగి స్టేషన్లు పితూరీ నాయాలు కొట్టివేస్తిరని తెలిసిపోయిచ్చి సార్.

స. ఇ. : ఠీక్ ?

పిళ్ళై ; అమా సాయిబూ.

బొస్టి ; నిజమూ. అబద్ధమూ తర్వాత ముందు చిందర వందరైన స్టేషను సర్దు, చింపేసిన ఫోటో కనబడనీయకు. ఊ. క్విక్.

స. ఇ. (కంగారులో సామాను తారు మారుగా సర్ది చిరిగిన రాజు బొమ్మ తీసాడు)

గుడాలు ; (చటుక్కున వచ్చి ఏమిటా ఫోటో ?

స. ఇ. : (కంగారు పడ్డాడు) హెమీలేద్ హుజూర్.

గుడాలు : ఇడియట్ కాన్‌బడుతూవుంటే లేదని అంటావ్. యిలా యియ్యుము.

స. ఇ. : చిత్తం హుజూర్,

గుడాలు : (ఫోటో చూపి) చక్రవర్తినే పేలికలు చేసి వేసినారా! (కండ్లు మూసుకొని) ఓ గాడ్ సేవ్ ది కింగ్.... (కళ్లెర్ర జేసి) వాట్ బాస్టియన్ మన్నెమునకు ఛీఫ్ ఆఫీసరువై యుండి కూడా ఇటు వంటివి సాగనిస్తున్నావా,

బాస్టి ; మన్నెమంతా పితూరీ మయమైపోయింది సార్,

గుడాలు ; ఎందుకు అణచలేకపోయినావ్ ?

బాస్టి ; అంతా ప్లాన్ వేస్తున్నాం సార్.

గుడాలు : వాట్ ఎ బ్లడీ ప్లాన్. దొంగతనము వారి జీతములు తినివేయుచూ కండ్లు మూసికొనినారా ?

బాస్టి : లేదు సార్.

గుడాలు ; లేనిచో సీతారామరాజు జాడేమైననూ తెలుసుకుంటిరా ?

బాస్టి ; లేదు సార్.

గుడాలు ; పోనీ అతడు ఎటుల ఉండునో తెలియునా,

బాస్టి ; తెలీదు సార్.

గుడాలు ; ఏం పిళ్ళై నీకు ?

పిళ్ళై ; సార్. వాడంత పొడుగూ కాదు, అంత పొట్టీ కాదు సార్.

గుడాలు ; షటప్ యూ స్టుపిడ్. ఏమి యస్సై నీకు తెలియునా ?

స. ఇ. : వాడ్కి హంత పొడుగూకాద్. హంత పొట్టి కాద్ హుజూర్,

గుడాలు ; యూ ఫూలిష్ మేన్!

స. ఇ. : ఠీక్ హుజూర్.

గుడాలు ; అయినచో ఎందుకు పట్టుకొనలేదు ,

స. ఇ. ; లేదు హుజూర్,

గుడాలు ; ఏమి లేదు ? మత్తు పట్టినవా ? పిరికి వచ్చినవా....రైట్. మేమే చూచుకొనెదము _ ఊ, ప్రొసీడ్. ఊరూరా దండోరా వేయించుము. పితూరీకి సాయమ్ చేసినచో ల్యాండును లాగుకొనెదమని ప్రకటించుము, బయట ఎక్కువ జనమ్ గుమిగూడినచో కాల్చి వేయుదమని హెచ్చరించుము, మీరు గాని తీవ్రముగా పనిచేయనిచో ఉద్యోగములు డిస్మిస్ చేసి వేయుదుము. తెలిసినదా ? (రివ్వున వెళ్ళిపోయాడు)

పిళ్ళె : (కంగారుగా బాస్టియన్‌తో) సార్ మీరుదా ఆఫీసరై వుండికూడా చింతపల్లి ఘాటురోడ్ కంట్రాక్టులో ఫణం తినివేస్తిరని పెరియదొరదా అనుమానం పడుచ్చి సార్.

బాస్టి : క్వయట్ నాన్‌సెన్స్,

పిళ్ళె : ఉన్నమాటంటిని....

స: ఇ, పీడు పక్కా లిటిగెంటుసార్. మోకాలికి బోడితలకీ ముడి పెడతాడ్.

పిళ్ళై : అమా నీ సంగతి తెలిసిపోయిచ్చి సాయీబూ. ఫణం తినివేసి పదాల్‌ని విడిచి పెడితివని.

స. ఇ. : తూత్ (బయట కారు హారన్)

పిళ్ళె ; నేనుదా పోదును సార్. (వెళ్ళాడు.)

శింగ : (ఉత్తరంతో వచ్చాడు) పితూరీదార్లు చోడారం కచ్చేరీ పైకి పోతుంట్రంట దొరా.

బాస్టి ; యప్పైనె వచ్చేసినా యింతవేపేం చేస్తున్నావురా అక్కడ ?

శింగ ; చూచుకుంటూ కచేరీకి పోయిణ్ను దొరా ?

బాస్టి : కళ్ళు మూసుకుంటూ కాటికి పోలేక పోయావ్ ? (లింగన్న చేతిలో ఉత్తరం చూపి) అదేంటి ?

లింగ : కచ్చేరీలో మీ కిమ్మని ఇచ్చింద్రు దొరా.

బాస్టి : (ఉత్తరం చదువుతూ) "అడ్డతీగెలపైకి పితూరిదార్లు పయన మయ్యారవి స్పెషల్ బ్రాంచి వార్త. మీరు తక్షణం రండి?.... ఆశ్చర్యం రోజుకొక్క స్టేషన్, స్టేషన్ తర్వాత స్టేషన్........ ఎంత సాహసం (లింగన్నతో) చోడవరం అంటావేంట్రా ?

లింగ : (కంగారు పడ్డాడు) అలా తెలిసింది దొరా.

బాస్టి : (గద్దించి) ఎలా తెలిసింది ?

లింగ : (తప్పిబ్బై) గేమంలో అనుకుంటుంద్రు దొరా.

స. ఇ. : చెవిటిముండాకొడుకు, వీడ్కి హేం తెల్బు సార్.

బాస్టి : సరే నీవు పోయి దండోరా వేయడానికి ఎవర్నయినా తీసుకురా.

లింగ : (గండం నుండి బయటపడ్డట్టు ) చిత్తం (వెళ్ళబోయాడు).

స. ఇ. : ఠైరో.

లింగ : (భయంతో ఆగాడు)

స. ఇ. (బాస్టియన్‌తో) ఆ మాటల్ వీడ్కి చెప్పి దండోరా వేయించేయ మంటే సరిపోతుందిగా సార్ ?

లింగ : (నిట్టూర్పు విడిచి గుండె సర్దుకున్నాడు)

బాస్టి : అవునవును ఒరేయ్ ?

లింగ : చిత్తం.

బాస్టి : సరిగ్గా విను. లేకపోతే కొంపలు మునుగుతాయ్.

లింగ : (చెవి దగ్గర పెట్టి) చిత్తం. సొప్పండి దొరా.

బాప్టి : పితూరీకి సాయం చేసినచో భూముల్ని దొరతనంవా లాక్కొనును. బయట ఎక్కువమంది జనం కనబడినచో చంపివేయును....ఏదీ ఒకసారి అను.

లింగ : పితూరీకి సాయం చేసినచో భూముల్ని దొరతనం లాక్కొనును.

బాప్టి : బేష్. తర్వాత?

లింగ : బయట ఎక్కువమంది కనబడినచో పంపివేయును.

బాప్టి : చంపేవురా- "పంపివేయును" కాదురా "చంపివేయును" అని వేయించు.

లింగ : చిత్తం దొరా?

బాప్టి : ఏదీ మళ్ళీ అను!

లింగ : చంపివేయునని వేయించు.

బాప్టి : వేయించేది నువ్వురా బ్రహ్మచెముడా.

లింగ : చిత్తం దొరా:

బాప్టి : ఊ. వెళ్ళు.

లింగ : చిత్తం. (వెళ్లాడు)

బాప్టి : ఏం మంచుతాడో ఏమిటో చెవిటి వెధవ. (ఇనస్పెక్టరుతో) పరే సీవిక స్టేషన్ ఆర్డరులో పెట్టుకో. నేను కబురు పంపితే గార్డు బందోబస్తు చేసి రావడానికి సిద్ధంగా ఉండు. జాగర్త. ఇక పితూరీ గితూరీ అంతా స్మాష్. నే వెడతా. (వెడుతుండగా

తలకు చూరు తగిలి పెంకు పడింది) అమ్మో. (వెనక్కి అడుగు వేసాడు)

స. ఇ. ఏ క్యాహై సాబ్ : (బయటకెళ్ళి చూచి వచ్చి) కోయీ నై పెంకు పార్.

జాప్టి : పెంకు కాకపోతే కొండనుకున్నావా ! ఇడియట్ అమ్మో ! నరే వుండు ! (తల ఒత్తుకుంటూ వెళ్ళిపోయాడు)

స. ఇ. ; అచ్ఛాసాబ్. (రెండడుగులు ముందుకేసి, సాగనంపి వచ్చి) జాప్‌రే బాప్, ఓ పెద్ద గండం గడిచిపోయింది. హిక ముందిక్క యేమున్నదో మునక్ళకీ పండుగ. (కుర్చీలో కూలబడ్డాడు).

# 3

(ఒక కొండ నానుకొని రెండో కొండవుంది. ఉదయ కాంతులు ఆ రెండు కొండల నడుమా పడుతున్నాయ్. ఎదుట పితూరీ రహస్య స్థావరం అక్కడక్కడ చిన్న గుట్టలు, కుడిప్రక్క కొండగృహ, అందులో కాళికాదేవి విగ్రహం వుంది)

జు : (భుజాన తుపాకివుంది. ఆ రెండు కొండల వెనుక జరుగుచున్న విన్యాసాలను తిలకిస్తూ ఒక్కొక్క అడుగే వెనక్కి వేసు తుంటూ కొండ ఎక్కుతున్నాడు)

( నే ప థ్యం లో )

విలచెరా : త్రేతాగ్ని విప్పులై కణకణ
మండుతూ, విస్తేజమైన జాతి !

విగిడెరా : త్రాచులై విలువెత్తు బుసబుస
మిడిసేన, విస్త్రాణమైన జాతి !

చెదిరెరా : నేల పెంజీకటుల్ : చరచర
మెరయగా, విద్రాణమైన జాతి!

చెరిగెరా : మనతల్లి చెక్కిళ్ళ బొటబొట
జాలువారిన, కంటి జలము జాడ !

కంఠ బిలమున కొండల పిండిజేసి
మేడితో మేది నిందున్ని మేరమీరు!
అన్నదానమ్ము జేయు కర్షకుల జాతి
కన్ను తెరచిన లోకముల్ కరిగిపోవె!

శహబాష్! ఇంతమంది వీరులు ఝాలు విదళించిన సింహాల్లా గర్జిస్తే రవి క్రుంకని బ్రిటిష్ సామ్రాజ్యమే కాదు. రవి ఏలే అఖండాంతరాళం కూడా దద్దరిల్లి పోవలసిందే. ఆహా! స్వతంత్ర భారత్‌కీ! (ఎదుట విన్యాసం జరుపుతున్న వీరులనుండి "జై!" అన్న సాముదాయక నినాదం, రణ దుందుభులు మ్రోగాయి కొండ దిగువకు చూస్తూ పిలిచాడు) గంటం?

గంట: (వచ్చాడు) ఏం రాజా?

రాజు; (కొండ దిగుతూ) అగ్గిరాజు కనబడడేం?

గంట; చోడవరం దాడిచేసి వస్తూంటే — కొండపల్లిని శత్రువులు ముట్టడించి, జనాన్ని హింసిస్తున్నారని తెలిసి. ఎర్రేశు నెవ కేసుకొని వెళ్ళాడట,

రాజు; అసలు చోడవరం దాడి కతన్నెవరు పంపారు?

గంట: అతనే వెళ్ళాడు.

రాజు; అతనతి దుండుడుకు మనిషని తెలుసా?

గంట; చూడకుండా ఎలా తెలుస్తుంది?

రాజు; అక్కడే వుంది అసలతడు మన పితూరీలో కెలా వచ్చి కలిసాడో గుర్తుందా? సహాయ నిరాకరణోద్యమమే అతడికి సంకుచితమై తెల్లవాడవేవాడి తలే నరకాలను తత్వంతో మనలో చేరాడు,

తలలు నరికితే విప్లవాలు వర్ధిల్లుతాయా ? పొట్టి దుందుడుకుతనం గాక అతని చర్యవల్ల మన పితూరీ అరాజకం పాలు కాకూడదు. ఇంటి దీపమని ముద్దుపెట్టుకుంటే మూతి కాలుతుంది గంటం !

గంట : సరే, అతడు తిరిగి రాగానే మందలిద్దాం. (బయట కోలాహలం. ఇరువురూ రెండడుగులు ముందుకేసి అటు చూసారు).

రాజు : ఏంటా కోలాహలం !

గంట : మహోత్సహం రాజా !

రాజు : అనగా ?

గంట : అదిగో ఇటే వస్తోంది మన వీరులతో,

రాజు : ఎవరు ?

గంట : ఇంకెవరు ? కాళీపూజకు కాలికి గజ్జకట్టిన మన రత్తి.

రాజు : ఆహా !

గంట : బహు చురుకైన పిల్ల (కొండదిగువ భేరీ నాదాలు "రణ....రణ" ధ్వనులు కొండపై నుండి చెంగున గెంతేసి వచ్చింది రత్తి ఆ వెనుక పడాలు, మల్లు, గోవిందు భుజాలపై చేతులేసుకొని వచ్చారు).

రత్తి : (భంగిమలో) భేరీ మ్రోగిందోయ్

ప. మ. గో : " భేరీ మ్రోగిందోయ్,

రత్తి : " మన్యం కొండల్లో

ప. మ. గో : " భేరీ మ్రోగిందోయ్

రత్తి : " ఆ కొండల్లో గండుపులి

ప. మ. గో : " ఘాండ్రించిందోయ్

రత్తి : " ఘాండ్రింప - సీమకుక్క-

ఆ గ్రెహెమెన్‌హేర్‌గాడు ఏనుగులూ, ఎలుగ్గొడ్లూ ఎనకేసుకొస్తే ఆగిందా అంట హే దెబ్బకు ఎగిరిపోనేదా ?

రాజు : అవును రత్తి మనకు జయం తధ్యం ! లే. (భుజాలుపట్టి లేపాడు)

రత్తి : (లేచి తన్మయంలో) సామీ.

రాజు : (వుద్వేగంతో) అవునమ్మా ఖాయం మన జయం.

రత్తి : (స్పందించి) మన్నెం పితూరీకి........

అంతా : జై.

రాజు : రత్తీ, నీలాంటి వీరాంగనలే కొందరున్నా మన దేశానికీ దుస్థితి వుండకపోను.

పడాలు : లేకపోమా, దొరలేనాడో దొడ్డిత్రోవను తోక జాడించి వుండే వారు.

గంట ; నిజం

రాజు ; సరే ఇక రండి శత్రుసంహారీ, మిత్రసహాయీ అయిన మహా కాళి దీవనలందుదాం. (ఆలయం ముందు కొచ్చాడు అంతా మౌనంగా వరుసగా నిలబడ్డారు!)

అంతా ; మహాకాళికి జై. (చేతులు జోడించారు)

రాజు ; (విష్టాగరిష్టుడై నమస్కరిస్తూ) శ్రీ మన్మహాదేవదేవీ • పహి మండలా వాసమైయున్న యోదేవతా సార్వ భౌమామణీ లోక సంచారిణీ భక్త చింతామణీ దుష్టశిక్షామణీ మంజు భాషామణీ పాపసంహారిణీ ముక్తి కాంతామణీ పాపనీ విన్ను వర్ణింప బ్రహ్మాది శేషుండునన్నోపగాలేని నేనెంత నోయమ్మ మున్ను యీ దానవానీక దుర్మార్గులంబాపగా పెక్కు రూపంబుల న్నాద్భ

ప. మ. గో : " "బొయ్" మందండోయి

రత్తి : " "బొయ్" మన్న సీమకుక్కావి

ప. మ. గో : " పులి తరిమిందోయి,

రత్తి : " "కాంగ్రు - కాంగ్రు - కాంగ్రు" మంటు

ప. మ. గో : " కంత మట్టిందోయి :

రత్తి : " కంత మట్ట సీమకుక్క

ప. మ. గో : " పట్టి కరిచిందోయి

గోవిందు : బలేగా చెప్పావ్ :

రత్తి : " ఊఁ:

గోవిందు : " గండుపులీ – సీమకుక్క
ఎవరెవరు ?

రత్తి : " గండుపులీ - కోయదొరా
సీమకుక్క - తెల్లదొరా :

ప. మ. గో : " ఒహ్హో : ఒహ్హో ఒహ్హో :

రత్తి : " భేరీ మ్రోగిందోయ్

అంతా : " రణ....రణ....రణ :

రత్తి : " భేరీ మ్రోగిందోయ్

అంతా : " రణ....రణ....రణ

రత్తి : " భేరీ మ్రోగిందోయి:

(ఆలాపనలో గిర్రున తిరిగి రాజు కాళ్ళ వద్ద పడింది.)

రాజు : (లేవనెత్తుతూ) నీ కోర్కె సిద్ధిస్తుంది - రత్తీ.

మల్లు : (ఐంటమందొచ్చి) సిద్ధించడం మేటంట ? మొన్న మన ఒంజేరి తడాఖా జన్మజన్మలకీ మరచిపోతరా - ఎధవ నాయాళ్ళ. హే

ఆ క్రైమెన్ హేర్‌గాడు ఏనుగులూ, ఎలుగ్గొడ్లూ ఎనకేసుకొస్తే ఆగిందా అంట హే దెబ్బకు ఎగిరిపోనేదా :

రాజు : అవును రత్తి మనకు జయం తధ్యం ! లే. (భుజాలుపట్టి లేపాడు)

రత్తి : (లేచి తన్మయంలో) సామీ.

రాజు ; (వుద్వేగంతో) అవునమ్మా ఖాయం మన జయం.

రత్తి : (స్పందించి) మన్నెం పితూరీకి........

అంతా ; జై.

రాజు : రత్తి, నీలాంటి వీరాంగనలే కొందరున్నా మన దేశానికీ దుఃవస్థ లుండకపోను.

పడాలు : లేకపోమా. దొరలేనాడో దొడ్డిత్రోవను తోక జాడించి వుండే వారు.

గంట ; నిజం

రాజు ; పదే ఇక రండి శత్రుసంహారీ, మిత్రసహాయీ అయిన మహా కాళి దీవనలందుదాం. (ఆలయం ముందు కొచ్చాడు అంతా మౌనంగా వరుసగా నిలబడ్డారు!)

అంతా ; మహాకాళికి జై. (చేతులు జోడించారు)

రాజు ; (నిష్ఠాగరిష్ఠుడై నమస్కరిస్తూ) శ్రీ మన్మహాదేవదేవీ •మహీ మండలా వాసమైయున్న యోదేవతా సార్వ భౌమామణీ లోక సంచారిణీ భక్త చింతామణీ దుష్టశిక్షామణీ మంజు భాషామణీ పాపసంహారిణీ ముక్తి కాంతామణీ పావనీ నిన్ను వర్ణింప బ్రహ్మాది శేషుందునన్నోపగాలేని నేనెంత నోయమ్మ మున్నీ యా దానవానీక దుర్మార్గులంబాపగా పెక్కు రూపంబుల న్నుద్భ

సంగతై తిపే తొల్లి యింద్రాది లోకంబునంజేరి తాజేయు కల్లోల ముంటాచి నీరాత్ములై యుండు పుణ్యాత్ములౌ దేవసంఘంబులాం తాజేయు నద్దేదియుం గానకో దేవి యోశాంబవీ శాంకరి యోశంభు రాణీ భవానీ రక్షింపుమో యంచు కై మోడ్పులై వేడ నౌతారము ల్బొంచియు జెక్కులౌ బాహువులం ఖడ్గశూలాద్య నేకాయుధా ల్బట్టి ఝుంకారమొప్పార క్రోధాగ్ని జ్వాలా ప్రకాశంబుచే వెలుగుచున్నట్టి నీ మోమునుంగాంచి యా దానవానీక బృందంబు లద్దిప్పి యా రూపమేనాడు జూడంగ లేదంచు యోతల్లి యోమాత యోదేవి రక్షింపు రక్షింపుమంచుం దగన్వేడుచున్నట్టి యవ్వారిన న్నీవె మహిషాసురుంద్రుంచి దేవాదులం గాచి రక్షించినావమ్మ యోతల్లి యో మాత యీనాడు యీ గ్రామ మందుండి యీరీతి యీ దొరల బాధలంబడవేయగానేల మేమెన్నడు న్నీకు నేయెగ్గు గావింపగా లేకున్న యీ పేదకోయ జనమేదైన గావించినం తల్లి వందాన శాంతంబునుంజెంది మన్నింపుమో పావనీ లోక మాతా మముం గావ నీకన్న వేరెవ్వరులేరు కాపాడి రక్షించు మీ బిడ్డలందొందు యీ బాధలంబాపి దుష్టులౌ యీ దొరల నీదు రౌద్రానలజ్వాల దగ్ధ మొనరించుమో తల్లి దేవీ భవానీ పార్వతీ శంభురాణీ కృపాదృష్టిచే మమ్ము గాపాడ నీకన్న మాకెవ్వరు న్వేల్పులున్నారు. విగ్నాల్చి ఏపేట నీ యుత్సవంబాదిగా జాతరల్జేసి తీర్థంబు గావింపుకొందుమో మమ్ము రక్షించుమో జగన్మాతా, తల్లీ నమ స్తే నమ స్తే నమః.

మాతా మహిషాసుర మర్ధనీ, మహాకాళీ, మేమంతా నీ బిడ్డలం. పిండితే పాలుగారే ధాన్యాన్ని నెత్తురుజేరుల ముంచే

త్తుతున్న ముష్కరులతో తలపడ్డాం, మన్యం పాడిపంటలు కొల్లగొట్టే బందిపోటుల నెదుర్కొంటున్నాం, పైశాచిక కృత్యాలతో మానవత్వాన్నే మంటకలుపుతున్న హంతకులతో పోరుతున్నాం. తల్లీ, ఇదిగో నీ పదములంటి ప్రమాణం చేస్తున్నాం, భరతగడ్డ నుండీ దొరలను తరిమివేసేంతవరకూ ప్రాణాల్నే తృణంగా త్యజించి పోరుసల్పుతాం, మమ్మ దీవించు తల్లీ. (లోపల శంఖారావం, గంటానాదం) భారతమాతకీ....

అంతా : జై. (అని నమస్కరించి రెండు పాయలు కాగా రాజు మధ్య నుంచి మహోత్సాహంగా వస్తున్నాడు)

రత్తి : సామీ ఇదిగో, నెత్తురుబొట్టు పెట్టుకొని విజయం తే సామీ, (బొటనవ్రేలు ప్రక్కనున్నవాని ఖడ్గపు అంచుకు కోసుకొని రాజు నుదుట గ్రమ్మున తిలకం పెట్టి వుప్పొంగి గిర్రున తిరిగి చివరికొచ్చి ఖడ్గం చాపి)
పులకరి స్తివీ, మా మనసులెల్ల
చిలకరించవా విజయాల జల్లు,

గోవిం : రత్తీ, (రత్తిని కౌగలించుకున్నాడు)

రాజు : తథాస్తు, రత్తీ.

గంట : అబ్బ మీ ముఖం చూ స్తేనే నెత్తురుజృంభిస్తోంది రాజా.

పడాలు : నెత్తురేకాదు, హిరణ్యకశిపుని వధించిన నాటి నారసింహుడు, జరాసంధుని ఛండాడిన నాటి భీమసేనుడు, సైంధవుని తలత్రుంచిన నాటి ఫల్గుణుడు....

రాజు : (కోపంగా) చాలు చాలు,

పడాలు : క్షమించు – రాజా,

రాజు ; ఇంకెన్నడూ స్తుతించకు మనిషిని విలువనా పూడ్చగలదీ ముఖ స్తుతి. (అంతా నవ్వారు)

మల్లు : అన్నోయి. విన్న నీవు చూ స్తివో లేదో గాని మన రాజుగోరే ఆ పెదవలనలో దొరల నాయాల్ని తరిమి తరిమి కొడుతుంటే నా సామిరంగా ! నా వొల్లు "ఝల్లు" మందన్నా అబ్బ తెల్లోడంటే రాజుగోరి కెంత పగో.

రాజు ; మల్లూ ! శత్రువు నంతగట్టిగా ద్వేషించలేనోడు మిత్రుని మాత్ర మెలా ప్రేమించగలడు ?

గంట ; ఎలాగూ మీరు మహావీరులు. పుట్టుకే - రాజు పుట్టుక!

రాజు ; అవును మన తెలుగుజాతే - వీరజాతి. వీరులుగానే పుట్టాం వీరులుగానే చస్తాం.

పడాలు : ఏమైనా ప్రజ్ఞావంతులు మీరు.

రాజు ; ఆ ప్రజ్ఞని తలదన్నిన విద్య మీనుండే నేర్చుకున్నాను.

గోవిం : మామండా ?

రాజు : అవును.

గంట ; ఏంటది ?

రాజు ; అనుభవం.

గంట ; మమ్మల్నెప్పుడూ మీరిలాగే పొగుడుతారు.

పడాలు ; అవును వీరు పొగిడితే తప్పులేదు. మనం పొగిడితే గోతిలో పూడుస్తున్నట్టు....(రాజుతప్ప అంతా నవ్వారు.)

లింగ ; (వచ్చాడు) సామీ శత్రువులు చిత్త కుక్కల్లా రెచ్చితిరి.

మల్లు ; రెచ్చి ?

లింగ ; మన్నెరోడ్లన్నీ బందుచేసి జనానికి తిండి రాకుండా చే స్తిరి.

మల్లు : వీళ్ళు రాకుండా చేస్తే బాగుణ్నే:

రాజు ; మల్లూ చెప్పవియ్

శింగ ; ఏడ చూచినా సైన్నేలే. అగ్గిరాజును తరమడానికి దొరొాకదు సేనతో వెళ్ళిండు.

మల్లు : తరమవియి అగ్గిరాజు - అగ్గిపిడుగులే.

శింగ; మల్లుమామా ? తెల్లసైన్నేలా చిల్లిగవ్వలమకోకుము.

పడాలు ; శింగన్నా శత్రుసంచలన మింత తీవ్రంగా వున్నపుడు తరచు నీ రాక మరింత ప్రమాదం సుమా,

శింగ ; అంతకంటె పెమాదం - విన్న "పెదవలస" లో దెబ్బతిన్న పైన్నేలు మరికొన్ని సైన్నేలతో మన దళాలకోసం గాలిస్తుం టిరి. వెయ్యిమందైనా వుంటరు పడాలూ. ఈసారి పెద్ద పెద్ద యుద్ధాల్లో గెలిచి, మనుషుల్ని చంపడానికి మొనగాళ్ళనిపించు కున్న కవర్దు, హైటరులు - ఆ సేనతో వచ్చింద్రు.

మల్లు ; రానియి. మనసత్తా చూస్తురు.

రాజు : సరే నీవు త్వరగా వెళ్ళు శింగన్నా. మన్యానికే నీవు గుండెవు సుమా.

శింగ ; మీరు మాత్రం భద్రం సామీ. (వెళ్ళబోయాడు)

రాజు : (పిలిచి) ఇదిగో మరిచాను, అన్నిటికంటె అతి ముఖ్యం - మన రహస్యస్థావరం మాత్రం వొల్లల్లా కళ్లుస్న్న దేవేంద్రుడికూ_డా తెలియకూడదు, (రత్తితో) రత్తీ నీవు శింగన్నతో వెళ్ళమ్మా! కొండ మలుపు వరకూ దిగబెడతాడు.

రత్తి : మరి మీరు తిండితిన్న సామాను ?

గోవిం : నేను తెస్తునులే. నీ వింటికెళ్ళు.

శింగ : రామ్మాత్రం.

రాజు : జాగ్రత్త శింగన్నా.

శింగ : నా జాగ్రత్తకేం సామి. మీ కషాయం రాసుంటావుంటే అదే పది వేలు.

రాజు : మీలాంటి పెన్నిధులు సన్నిధులై యుండగా అది కలలోని వార్త. వెళ్ళండి.

శింగ : రామ్మా. (రత్తితో వెళ్ళిపోయాడు)

గంట : నిజంగా, శింగన్న చిమకూ చిమకూ చీల్చుకుపోగలిగిన సహా దేవుని కత్తిలాంటోడు.

పడాలు : కాకపోతే బాస్టియన్ ఉక్కువలయాలన్నీ సైన్యాల చక్రబంధాన్నీ భేదించుకు రావడం, మాటలా?

రాజు : గోవిందూ, ఎందుకైనా మంచిది — నీవు కూడా ఓ దళంతో వెళ్ళి కొండ దిగువ పహరా చెయి.

గోవిం : అలాగే. (వెళ్ళబోయాడు)

రాజు : చూడు. శత్రువు కంటబడ్డాడా? మిరపతాయ మొనకు కట్టి బాణ మిక్కడకెయి. జాగ్రత్త. మనం దొరికినా మన స్థావరం మాత్రం శత్రువుకి దొరకక్కూడదు.

గోవి : అలాగే. (కొండ మలుపులోంచి వెళ్ళాడు. కాల్పుల శబ్దం)

రాజు : ఎక్కడమండీ కాల్పులు?

గోవిం : (ఒగర్చుతూ వచ్చాడు) సామి పటాలాలు పైబడుతుంటివి. వలయాకారంగా విరగబడుతుంటివి. (మరల కాల్పులు)

గంట : (రాజును ప్రక్కకి లాగి) మీరిలా ప్రక్కకురండి.

రాజా : కంగారెందుకు : యీ కొండలను [illegible] అంత తేలిగ్గాదు.

మల్లు ; అవి వూరుకుంటే మన మెగిరిపోతమే.

పడాలు : మిరుండండి. చూసొస్తా. (గబగబా కొండ ఎక్కి చూస్తున్నాడు)

గోవిం ; ఏదో వేగిరం చెయ్యాలి సామీ.

పడాలు ; (కొండమీద నుండి) చాలా సైన్యం వుంది రాజా. మహా ప్రవాహంలా ముంచుకొస్తోంది.

రాజా ; (గబగబా కొండెక్కి) అవును. వచ్చేస్తున్నారు. రాజును చూచిన ఐనట పితూరీద్దార్లు "సీతారామరాజుకీ జై" అని నినాదాలిచ్చారు)

పడాలు; వాళ్ళకేదో వ్యూహం చెప్పండి.

రాజా : (కొండ క్రింద పితూరీదార్లతో) ఆపండి వెంటనే చెదిరిపొండి. ప్రతీ గుట్టకీ పుట్టకీ చెట్టుకీ ఒక్కొక్కడుగ ఆవహించండి. ఊ. చెదిరిపొండి. (చెదిరిపోయినట్టు పెద్ద అలజడి) మీకుశృంగనాదాలు వినిపించగానే కాల్చండి. (పడాలుతోపాటు కొండదిగాడు).

మల్లు : మనం చెదిరిపోవడ మెందుకంట. ఇట్టాగే వుండి ముఖాముఖీ తేల్చుకుంటే సరిపోతదే ?

రాజా : మల్లూ పౌరుషానికి లక్షణం ప్రాణత్యాగం కాదు. ఎంతమంది శత్రువుల్ని కూల్చామన్నదే లెక్క. (బయట కాల్పులు)

గంటం ; శత్రువులు మీద పడుతోంటే మన కిస్పుడు రాద్ధాంత సిద్ధాంతాలా రాజా వెయి. వ్యూహం.

మల్లు : (ప్రక్కకెళ్ళి సైన్యాలను చూచి) వాళ్ళటు పోతుంటిరిగా ?

పడాలు ; ఎక్కడికి పోతారు? అదిగో. అక్కడ చూడు.

మలు : ఏంటహే ?

పడాలు ; పొదలకు పాగాలు

మల్లు ; ఎందుకంట ? (రాజూ, గంటం, గోవిందూ వెళ్ళి చూసారు)

రాజు ; వెభాష్, పడాలూ, మొనగాడ వనిపించుకున్నావ్. చతురతలో శివాజీని మరిపిస్తున్నావ్. ఆనాడు శివాజీకూడా యిలాగే పొదలకు పాగాలు చుట్టి ఒక గెరిల్లా దళంగా శత్రువును మభ్యపెట్టి దెబ్బ కొట్టాడు.

గంట : ఇంత ఘటికుడ వనుకోలేదు. - పడాలూ,

మల్లు : భలే పన్నాగం పన్నింటివే!

రాజు : ఇప్పుడర్ధమైందా మల్లూ ! వాటిని చూడగానే ఆ సైన్యాలు కంగారుగా వెనక్కు వస్తాయ్. ఆ వచ్చిన సైన్యాలను నేనీ ప్రక్క వాగులోకి మళ్ళిస్తా (చూపుతూ) అదుగో శింగన్న చెప్పిన కవర్టు హైటరులు వాళ్ళే అయి వుంటారు. వాళ్ళపని నీవూ గంటం పట్టండి.

మల్లు : సైయ్యే.

రాజు ; వాళ్ళెప్పుడైతే చస్తారో అప్పుడు వారి సైన్యంలో ముసలం పుడుతుంది. బెదిరి చెదిరి పోతారు పడాలు. నీవు అదిగో ! ఆ కొండ ప్రక్క పొదలో మాటేసి శాల్చి సమసని శౌర్యంతో సమరోత్సాహంతో! చిందులు తొక్కే మన కోయ, చెంచు, దేవులు నీకు అండదండలుగా వుంటారు.... వాళ్ళు తిరుగు ముఖం పట్టే త్రోవలో నేను కాపి అమ్ముల వర్షంతో కూల్చివేస్తా ఆ చివర కొండ కొననూ కాచివున్న గోవిందు ఆ కొంపల పై నుండి పెద్ద పెద్ద బండలను దొర్లించి వాళ్ళ పుర్రెలు పుచ్చకాయల్లా పగిలేలా

చేస్తాడు, అంతే జాగర్త. ఈరోజు ఆంధ్రజాతి చరిత్రలో భారత స్వతంత్ర సంగ్రామంలో సువర్ణ ఘట్టం కావాలి. మాతృగడ్డ కోసం ఆత్మ బలిదాన మిచ్చిన ఇంగ్లీష్ బెబ్బులులు పతాపీ పోటరులు. మహారాష్ట్ర మ త్రేఖాలు, పంజాబు సింహాలు. తెలుగు వీర తురంగాలు తలపుకు రావాలి.

గంట ; భేష్. రాజా! (కాల్పులు "ధన్, ధన్, ధన్" మంటూ ఏకధారగా ధ్వనించాయ్)

పడాలు : పద, గోవిందూ !

రాజు ; ఊ, వెళ్ళండి! వృథగా ఒక్క తూటా కూడా కాల్చపదు! ఒక్కొక్క తూటా మనకొక్కొక్క వీరుడే సుమా ! అటూ ఇటూ ఎటుచూచినా మనవాళ్ళే కనబడాలి. తెల్లవాళ్ళ కళ్లు చెదరి పోవాలి.

పడాలు ; మీరు జాగర్త మేం వెళ్ళొస్తాం! (గోవిందుతో వెళ్ళిపోయాడు)

రాజు ; సరే మల్లు నేవెళ్ళి ఆ మృగాలనీ వాగులోకి రప్పిస్తా. మీరిరెండు కొండల సందునే కూర్చోండి ! (ముందుకొచ్చి ఒక ఆకుపై చోరుతో రాసి) "మీకు ధైర్యముంటే యిక్కడ కొచ్చి ఎదిరించండి. ఇట్లు రాజు" (ఉత్తరానికి మిరపకాయ కట్టి విల్లమ్ములు సంధించి ముద్దుపెట్టి కొండ ఎక్కి "భారత మాతకీ జై" అని విడిచిపెట్టి కొండదిగి) గంటం, నేను శృంగనాదం చేయగానే మీరు కాల్చండి సుమా (వెళ్ళాడు లోపల కాల్పులు, వివాదాలు)

మల్లు ; రెండు కొండల సందునుండే) పన్నాగం పారింది. అవిగో ఆ తెల్లమృగాలిటే వస్తుంటివి. అన్నా కొడితిమా "టపీ" మని ఎగిరిపోవాలి, శవాలు యీ వాగులో పడి దొర్లిపోవాలి....

గంట : ఉష్....ష్....ష్....ష్....ష్ కంగారుపడకు. గురి తప్పకూడదు. పదమా !

మల్లు : వచ్చేపారన్నా ! మన్యం సంపదలు తెగ మెక్కి కై పెక్కి ఎట్ట నడుత్తుంటిరో వెధవనాయాళ్ళు. కాల్చన్నా ! ముందు వాడివి నేను, వెనకవాడివి నీవు....

గంట : ఆగు. రాజాగారి శృంగనాదం రానీయ్.

( వే ప ధ్యం లో )

పోరుడో ! చిచ్చుల పిడుగులై బ్రిటిష్
 దొరల గుండియల శతఘ్ని మ్రోగ
పోటెత్తుడో ! పెనువీరంగిన పెన్నిధై
 ముష్కర నివహముల్ ముంచి వేయ
కుప్పించి దూకుడో కుంభి కుంభములపై
 సింహాలుగా యాంగ్ల సీమ వ్రాలక,
చెలగుడో చండ ప్రచండమౌ మీదుకో
 దండ షాండితిని దిగ్దక్కు అదర!
తెలుగు విజ్ఞాన మన్ని ఖండముల మెరియ
తెగువ శతపోరి మన తెల్గుతల్లి ముక్తి
తెరిర సాధించ లెమ్మురా, తెలుగుబిడ్డ
తెలుగు పేరిన్న వత్తురు తెల్లదొరలు.

గంట : (శృంగానాదం వినబడింది) జయం. కాల్చు. (ఇద్దరూ ఒక్కసారిగా కాల్చారు)

మల్లు : ఎగిరిపోయారు వెధవనాయాళ్ళు. (లేవబోయాడు, ఒక గుండు రివ్వునొచ్చి జెబ్బలో దూసుకుపోయింది) అమ్మా.

గంట : (పట్టుకొని) చూసావా ? చెయ్యెగిరిపోయింది. వాళ్ళప్పుడే పిచ్చి కుక్కలై పోయారు.

పడాలు : (వచ్చి) పిచ్చికుక్కలై పరుగెడుతుంటే ఆ చివర కొండ కొన పైన మన గోవిందు కొండ పణుకుల దొర్లించి పుర్రెలు పగుల గొడుతున్నాడు....

మల్లు : సెభాష్

పడాలు : జాగ్రత్త. కుక్కలే కరుస్తాయి. పోతూపోతూ కాల్పొచ్చు. మీరు కాల్పులు మానకుండా వ్యూహంలో ఉండండి. (వెళ్ళిపోయాడు)!

గంట : అవును జాగ్రత్త మల్లూ. (ఇరువురూ తమ స్థానాల్లో తుపాకిపట్టి ఏకాగ్రతతో ఉన్నారు. బయట భీకర కాల్పులు, సైనికుల మరణాక్రందనాలు రెండు నిముషాలు గడిచాయి)

పడాలు : (వచ్చాడు - చురుగ్గా)

మల్లు ; (చెక్ మని వెనుదిరిగి) మనోళ్ళేమయినా దెబ్బతింటిరా ఏం?

పడాలు ; లేదు జయం మనదే, శత్రువులు పారిపోయారు.

గంట : రాజెక్కడ ?

పడాలు : పారిపోతున్న శత్రువులను తరుంతున్నాడు.

మల్లు ; సామిని వొదిలొస్తివా?

పడాలు : అరుగో వస్తున్నారు,

రాజు ; (రక్త మరకలతో వచ్చి) పక్షుల్లా రాలిపోయారు - రాక్షసులు. ఇప్పుడు - తెలుస్తుంది. తెలుగుల సత్తా.

గోవిం ; (వస్తూ) తస్సాదియ్యా. రామరావణ యుద్ధాన్ని మించి పోయిం దివ్వేళ.

మల్లు ; కవర్దుహైటరు లంటరే - పందుల్లా దొర్లిపోతిరి - లోయలోకి.

గోవిం ; ఏ త్తెమా ?

గంటి ; సత్యం గోవిందూ !

రాజు : బేష్_గంటం_బేష్. మన్యం మగతనాన్ని చాటారయ్యా.

పడాలు ; మన కోయ, చెంచు వీరులకు మరికొన్ని ఆయుధాలున్నా శత్రు వులను తుడిచి పారవేసే వాళ్ళం.

రాజు ; అవును పడాలూ ! మనకింకా ఆయుధాలు కావాలి. శత్రువును గ్రుక్క_తిరక్కుండా కొట్టాలి. ఇదే బిగిని దగ్గరలో నున్న అన్న వరం స్టేషన్ కొల్లగొడదాం పదండి.

మల్లు : యీ దెబ్బతో నాయాళ్ళపని సరి . పదండహే!

రాజు ; పదండి ! (ముందుకు సాగారు)

పడాలు : అల్లూరి సీతారామరాజుకి

అంతా ; జై ! (మల్లు ఎత్తుకొనగా అందరూ అందుకొని పాడుతూ నడు స్తారు)

అల్లూరి సీతారామరాజ !
మా కోయల బాధల బాపా అవతరించిన రాజ
అల్లూరి సీతారామరాజ
తెల్లదొరలకు నీ పేరన్న హడలు !
దుష్టశక్తులకు నీవన్న భయము!
క్రూరమృగములైన కుక్కలుగా తిరుగునురా ॥అ॥
రఘురాముడివై విల్లు పట్టినావు
పరశురాముడవై లంఘించినావు
శత్రుశిరములనెల్ల ఎగరేసి నరికావు ॥అ॥

బాలచంద్రుని మోము నీది
వెన్నపూసా మనసు నీది
నీ పలుకే గిరిజనులకెల్ల వేదవాక్కాయెనురా ॥బా॥

(రెండు నిముషాలు గడిచాయ్, "ధన్" మని తుపాకీ కాల్పు వినబడింది. గుడాల్, బాస్టియన్, సబ్ ఇనస్పెక్టరులు నేలను కరచుకుంటూ వచ్చి మరో క్షణానికి బెదురుతూ లేచారు)

గుడాలు : వాట్ ఎ కరేజ్ ? వాట్ ఏన్ ఎడ్వంచర్ ? మహేగుల్లాంటి కవర్డు హైటర్ను నే కూల్చివేసినారు. ఇంతటి పరాక్రమ వంతులను ఎందునూ మేము చూచి వుండలేదు. (ఏదో తట్టినవానిలా లటా లున బాస్టియన్ వొంకకు తిరిగి) బాస్టియన్ ?

బాస్టి : (తుపాకితో దిక్కులు చూస్తూ వస్తూ ఆ కేకకు అదిరి) సార్ !

గుడాలు : కావర్డు — హైటరుల శవాలను సైన్యములు వుండి కూడా ఏల తీసుకు వెళ్ళలేకపోతిమి తెలుసునా ?

బాస్టి : నో సార్,

గుడాలు ; నీకు తెలియదు. పితూరీదారుల సాహసంలో వీసమెత్తు మీలో ఉన్న యెడల ఏనాడో యీ పితూరీని స్మాష్‌చేసి వుండెడివారము తెలిసినదా ?

బాస్టి : యస్ సార్.

గుడాలు : వాట్ ఎస్పార్ రాజు పర్మిట్‌చేసిన పిదపను గదా శవాలను తీసుకెళ్ళగలిగితిమి. ఐ కేర్ — బాస్టియన్ ! ఇప్పటికైనను నీ రికి తొలగించుకొనుము. (శౌర్యము తెచ్చుకొనుము....దూరంగా కోలాహలం, వరుసగా విపరీతమైన కాల్పులు అందరూ భయంతో ఒక్కసారిగా నేలను కరచుతున్నారు) ఏంటా ఫైరింగ్ ?

బాస్టి : చూడు యస్సై ?

స. ఇ. : (వెళ్ళబోతూ) హడుగో పిళ్ళేకి పరుగెత్తుకు వస్తున్నాడ్. (అంతా అటు చూసారు)

పిళ్ళె : (ఒగర్చుకుంటూ వచ్చి) సార్....సార్....

గుడాలు : వాట్ ?

పిళ్లె : మనదా పిపాయీలు పత్తుమంది చచ్చింద్రు సార్.

గుడాలు : హో మైగాడ్.

పిళ్ళె : అమా సార్. పత్తుమంది సార్.

బాస్టి : ఇక్కడ పితూరీదార్లు లేరే ?

గుడాలు : నాన్సెన్స్ యీకడా ఆకడా ఏమిటి ? ఏకడ చూపినా వారలే నేల యీవినటులుంటిరి, చూడడం లేదా ?

పిళ్ళే : వాళ్ళు ఇళ్ళె సార్.

గుడాలు : వాట్ ?

పిళ్లె : అమా సార్. మనలో మనవాళ్ళుదా కాల్చుకు చచ్చింద్రు సార్.

గుడాలు : నో, నో, అన్‌బిలీవబుల్ మిళ్ళీవియస్.

పిళ్ళె : పెరియ మోసందా సార్. మనదా పిపాయిలు వస్తోంటే "కాంద్రు కాంద్రు" మని....

స. ఇ. : పులే ?

పిళ్ళే : అమా అరుపులు వస్తిపీ. కొండకావతల ఏదో దుమికిన శబ్దం అయిచ్చి....

బాస్టి : అయితే ?

పిళ్ళె : "పులి" అని మనదా పిపాయిలు భావించి కాల్చింద్రు.

స. ఇ. : కాలిస్తే ?

పిళ్ళై : కొండ కవతల పోతున్న మనదా సిపాయిరే పితూరీదార్లనుకొని వెనక్కి కాల్చిండ్రు.

గుడాలు ; హో ! వాట్ ఎ ఫూలిష్ యాకు ?

బాస్టి ; అయితే ?

పిళ్ళై ; పత్తుమంది సఫా సార్.

బాస్టి : షటప్ !

గుడాలు ; కౌనార్డ్స్, స్కౌండ్రల్స్,

స. ఇ. ; (అటుమూపి) శింగన్న ఆతాహై సాబ్,

బాస్టి ; వాడేం చావు కబురు తెస్తాడో ?

శింగ ; (వచ్చి) దొరా ఏహొంపుల ఘాటీపై మన సామాను బళ్ళన్నీ దోచిండ్రు దొరా,

బాస్టి : పితూరీదార్లే ?

గుడాలు ; కాదు. ఎలుకలు, కొండ ఎలుకలు ! హో........ (సాలోచనగా) బాస్టియన్,

బాస్టి : సార్,

గుడాలు : ఇటు రమ్మి.

బాస్టి : (దగ్గరకు రావడానికి వెనుకాడుతున్నాడు)

గుడాలు : రామ్మి.

బాస్టి ; (వచ్చాడు)

గుడాలు : (బాస్టియన్ చెవిలో ఏదో ఊదాడు) ఇపుడు చేప్పుము బాస్టియన్- ఏటుల వున్నది మైప్లాన్ ?

బాస్టి ; అద్భుతం దొరా,

గుడాలు : (సైగతో మరల పిలిచాడు) ఆ భాస్కర్రావు గాదా సీతారాం రాజుకు మొదట ఆశ్రయ మిచ్చినాడట. అతడు జంటిల్‌మన్

అటగదా : అతడి మాటకు సీతారాంరాజు అడ్డు చెప్పడని కూడా తేలినది. మనమూ ఓడిపోయితిమని సీతారాంరాజుకు స్వయముగా ఏక్స్యూస్ చేపుకొనెదమని ఇతడిని నమ్మించినచో ఇతడే అతడిని వొప్పించి మన వద్దకు పొంపును. వాడువచ్చును.... చాచ్చును ....

డాప్టి : ఓహో, వెరీగుడ్ ప్లాన్ సార్.

గుడాలు ; అహ్హాహ్హాహ్హా. వెంటనే ప్లాను ఎగ్జిక్యూట్ చేయుము బాప్టియన్. ఇక రాజు గీజూ అంతా స్మాష్. ఫ్యుషాన్ (అంతా వెళ్ళిపోయారు)

# 4

రత్తి యిల్లు, ఉట్టిపైన వంటసామాను, ఇంకో ప్రక్క బట్టలదండెం, దానిపై అంగా, గోడకు రామపట్టాభిషేకం బొమ్మ. క్రింద దేవదారు పెట్టె, ఆ ప్రక్క వెదురు మంచం వున్నాయి. రత్తి గోదమన్న చేట తీస్తుండగా కాంతి ఆమె ముఖంమీద పడ్డం తెరలేవడం జరిగింది.)

రత్తి : (చేటతో వచ్చి రోటిలో చోళ్లు చేటలో పోసి రోకలి తీసి దంపు తోంది.)

సువ్వీ, సువ్వన్న రామ సువ్వీరామ
పిదులా నరులన్ని మావన్ని రామ,

పుట్టపైని తేనెపట్టు
ఉట్టిపైని బద్ది చట్టి
కుంపిణీవాడి దంటడూ
ఎత్తూక పోతనంటడూ ॥సు॥

చక్కనైన మన్నెపట్టు
పిల్పించు పట్టి పట్టి
పాపమూ – ఎంచవంటడూ
నిలువెల్ల దోచుకుంటడూ ॥సు॥

నత్తిగోవు ఆడబొట్టు
కంటి కన్నీటి బొట్టు
వుసురంతా – పోసుకుంటడూ
భగ్గున మండిపోతడు.... ॥సు॥

గోవిం : (బయట నుండి) రత్తీ !
రత్తి : (దంపు ఆపి తలుపు తీసి) మామా !
గోవిం : (ముందుకొచ్చి) రత్తీ.
రత్తి : (కాస్త దూరంగా తప్పుకొని) ఎందుకేం ?
గోవిం : ఏమిటా పెడముఖం ?
రత్తి : ఏంలేదు.
గోవిం : అయితే పద ! కొన్నీళ్లు పెడుదువి!
రత్తి : (కోపమొచ్చింది, గోముగా దూరంగా వెళ్ళి) నేపెట్టను.
గోవిం : (కూడా వెళ్ళి) ఎందుకో కోపం?
రత్తి : మరి పగలు చేలంటవ్, పొద్దు గూకాక పితూరీకి పోదునంటవ్, ఇంటికా దెప్పుడుంటవేం ? .
గోవిం : అదా ఇటు చూడు,
రత్తి : (వెనక్కి తిరిగి) ఏమందువేం ?
గోవిం : (భుజాలపై చేతులేసి) రత్తి పితూరీ వుండబట్టే తెల్లవాళ్ళ చెర పట్టిన మన భూదేవిని మరల విడిపించు కుంటిమి. పనిచేయబట్టే ఆ భూదేవి పంటను యింట వేసుకో గలుగుతుంటిమి.....నీవు దంచగలుగుతుంటివి తెల్సా ?
రత్తి : నాకు తెల్దంటవా. కొంచేపు వుండమనంటి గాని.
గోవిం : వుంటే పెద్ద నష్టం రత్తీ.
రత్తి : (కోపంగా) అయితే పో, మామా. నీకు నీళ్ళు పెడుతును, (చక చక వెళ్ళిపోయింది)
గోవిం : (రత్తి కూడా వెళ్ళాడు. లోపల తనకు ఆమె నీళ్ళు పోస్తూ వీపును తోముతున్న రత్తి గాజుల శబ్దం, ఓ క్షణానికి రత్తి గబగబా

వచ్చి దండెంపై తుండుగుడ్డ తీసుకెళ్ళింది, తను వొళ్లు తుడుచుకుంటూ వస్తూ) రత్తీ ! నీవంటే నాకెంత మనసో తెలుసా? చేలపై ఎవరు పొలికేక వేసినా, ఆ కేకలో తియ్యటి నీ గొంతె నన్ను పిలుస్తున్నట్టుంటది. ఏ అర్ధరాత్రో ఏ పటాలంతోనైనా పోరు సంభవిస్తే - నిన్ను తలచుకుంటే చాలు - నాకు ఏనుగుబలం వస్తుంటది రత్తీ; నిజంగా నీవు నా.... (వెనుకవస్తున్న రత్తిని ఆలింగనం చేసుకోబోయాడు. రత్తి ప్రక్కనులేదు. కూడా వచ్చి దొడ్డిగుమ్మం వద్ద నిలబడి పోయింది. ముందుకు తను వెళ్ళి ముఖం ఇటు త్రిప్పాడు) ఎందుకా, కోపం ? చెప్పు రత్తీ.

రత్తీ : ఊఁ. చెప్పను.

గోవిం : అయితే నేవెళ్ళిపోతను. ఇక రామలే. (గబగబా బయలుదేరాడు)

రత్తీ : (కూడాపడి) సెప్పుతుంటి పోకు మామా.

గోవిం : మరి చెప్పు.

రత్తి : (దొడ్డిగుమ్మాని కళ్ళముఖంగా నడుస్తూ) చూడు మామా, కాలం సొగసు. ఆ మామిడ్డితోపు చూస్తివా ? ఆ తోపులో గుబురుగా పొందిగ్గా పెరిగిన ఆ చెట్టు ఎంత ముద్దుటగా వుంది మామ....ఆ పాకిపోవు పలవలు, ఆ పలవల్లో చంటిబిడ్డ వ్రేళ్ళలా చిలుపలూ. ఆ చిలుపల్ని కుందనం రేకుల్లా పిగుళ్ళు ఎంత సింగారంగా వుంటివి.

గోవిం : అవును వసంతకాలం. చిగురిస్తవి - చెట్లు.

రత్తీ : చెట్లేగాని మనుషులు, మచ్చలూ సిగర్చరా.

గోవిం : బలేమాట ఆడిగావ్.

రత్తీ : సూడు మామా. ఆ గుబురుగా వుంటిదే - ఆ పలవల సందున....

గోవిం : ఏదీ ?

రత్తి : అదీ.

గోవిం : (చూచి) అదా. పక్షిగూడు ?

రత్తి : అందులో ఏముంటిదీ ?

గోవిం : ఏముండిది ?

రత్తి : పక్షి పొదగడంలే ?

గోవిం : అయితే ?

రత్తి : (సిగ్గు విరగమ్మి వెనక్కి తిరిగి గోవిందు బాహువుల్లో తల పొదిగి) వో మామ ! నీకంతా సెప్పాలి సిగ్గు విడిచి ?

గోవిం : ఓ రత్తి - తల్లి కాబోతుందన్న మాట (పకపకా ఇరువురూ నవ్వుకున్నారు) అయితే బుజ్జోడికి మన రాజుగారి పేరు పెడుదం రత్తి !

రత్తి : ఆలూ, సూలూ, లేదు పేరు పెడుతుంటివే. (మళ్ళీ పకపకా నవ్వుకున్నారు. గంటం ఆతృతగా ఆ దృశ్యం చూచి "టకీ" మని ఆగిపోయాడు. రత్తి గోవిందులు సిగ్గుపడ్డారు)

గంట : గోవిందూ ! నీ ప్రేమకలాపాల కిదా సమయం ?

గోవిం : ఇప్పుడేం వచ్చింది మామా.

గంట : ఎప్పుడొచ్చినా సరే. మన్యం మన్యమంతా వుడుకెత్తి పోతుంచే. శత్రువు సైన్యాలతో వూళ్ళు వూళ్ళన్నీ ముంచెత్తుతుంచే. నీ కిక్కడ ప్రేమకలాపాలా ? పిచ్చివాడా ! స్వేచ్ఛా స్వతంత్రమున్నప్పుడే ప్రేమకు సుఖం. రాజుగారి సంగతి నీకు తెలీదు. నీకంచే అందరి కంటె ఘనంగా పంచప్రాణాలతో ప్రేమించారొక అమ్మాయిని.

రత్తి : యీ సంగతి నాకు తెలవదే ?

గోవిం : నాకూ తెలదే ?

గంట : అవును. అదో రహస్యం. ఆయన చదువుకుంటున్నప్పుడే విశాఖ పట్నంలో ఓ కామందుల అమ్మాయిని ప్రేమించారు కాని దేశంలో స్వతంత్ర జ్వాలలు అలుముకున్నాయి, స్వతంత్ర పోరాటంలో ఒక స్త్రీ ప్రేమ ప్రధానం కాకూడదనుకున్నారు........ రంగంలో దూకారు, మరలెన్నడూ ఆమాటే తలపెట్టలేదు. ఐతే గుర్తుకు ఆమె పేరును తనలో కలుపుకుని రామరాజు "సీతారామరాజు" అయ్యారు.

రత్తి : విడ్డూరంగా ఉంటిదే, ఆతల్లి పేరు సీతమ్మన్న మాట,

గంట : అవునమ్మా ।

గోవిం : నిజంగా ఆయనో అగ్నికణం,

గంట ; (కంగారుగా) ఇప్పుడొక అగ్నికణం చాలదు. అనేకం కావాలి. జ్వాలలుగా మారిపోవాలి. రా వెంటనే, ఇక పూర్వంలా పగలు చేలలోనూ, రాత్రి పితూరీలోను పనిచేయుట అసాధ్యం. నేడు ప్రతీక్షణం ప్రమాదంగానే వుంది....

గోవిం ; అదేంటి మామా ! నీ అప్పి ఆ బాస్టియన్ స్వాధీనం చేసుకొని భార్యను, కూతుర్నీ అడవుల పాల్జేసి, ఖైదు చేసి . హింసించిన ప్పుడు లేని కంగారిప్పుడెలా వస్తిది ?

గంట ! ఇంకా కంగారంటున్నావా ! కొండపల్లిని దగ్ధంచేసారు - నీచులు.

రత్తి ; రెండుసార్లు నడింపాలెం తగలెట్టినోళ్ళు ఎన్నైనా చేస్తురు.

గోవిం : అయితే శీఘ్రం పద మామా !

గంట ; పద.

గోవిం ; (వెళ్ళిపోతూ) రత్తి !

రత్తి : గోవిందూ? (రెండడుగులు ముందుకేసి నిలబడి, చేయివూపి తలు పేసి, రోటిలో చోళ్ళు చేటలో పోస్తోంది. దొడ్డిలో తలుపుతట్టిన శబ్దం. "రత్తీ" అంటూ కేక. రత్తి వెనుదిరిగి వెళ్లి తలుపు తీసింది. రత్తి ముందు రాజు ఆతృతగా వెనుక వచ్చారు)

రాజు ; గంటం వచ్చాడా రత్తీ ?

రత్తి : ఇప్పటిప్పుడే పోతిరే ?

రాజు : అయితే సరి. గంటం కోసమే వచ్చాను వెడతా.

రత్తి : నువ్వెందుకొస్తివి _ సామీ. మీరేదో కచ్చేరీలు కొట్టేత్తుండారని వచ్చినోళ్లు ఊళ్ళమీద పడి హింసిస్తుంటిరి.

రాజు : లేదమ్మా. వాళ్ళసంగతివేళ, యీ పొలిమేరలోనే తేలిపోతుంది.

రత్తి ; గంటం మామ గోవిందును వెంటెట్టు కెళ్ళిండే.

రాజు : అవును. వాళ్ళనోచోటికి వెళ్ళమన్నా. మరి నేవెడతా.

రత్తి ; ఉండు సోమీ. నాదో మాటుంది. అదెన్నడూ నాతో సెప్పింద్రు కాదే ?

రాజు : ఏంటది?

రత్తి : మీరో కామందుల పిల్లకు మనసిచ్చిరటే ?

రాజు : రత్తీ ! (గద్దించాడు)

రత్తి ; సోమీ (అదిరింది వీధిగుమ్మం ముండి శబ్దం. రాజు ముందు కెళ్ళారు) పీ వచెల్లకు సామీ ! అది పగోడి సందడే.

రాజు : అయితే నీవెళ్ళి వూరవతల మన దళాలకు కబురుపెట్టు, నే నిక్కడే తేల్చుకుంటా ! (ముందుకెళ్ళబోయాడు)

రత్తి : (అడ్డువెళ్ళి) వొద్దు సోమీ ! పీపీ దొడ్డి త్రోవను వెళ్ళు సామీ, నే వెట్టా అయినా వీళ్ళ కళ్ళ కారం కొడుతుమ.

రాజు : రత్తీ, మగవాడినీ, అబలాసంరక్షణకు ప్రసిద్ధిగన్న క్షాత్రజాతి బిడ్డన్నీ యిక్కడుండికూడా నిన్ను ఆ రాక్షసుల కప్పజెప్పనా ? మనుషులంటే వాళ్ళకిప్పుడు బొత్తిగా లక్ష్యంలేదు, కాల్చివేస్తున్నారు రత్తీ, నీవాగిపో ! (తలుపు తీయబోయాడు)

రత్తి : (అడ్డువెళ్ళి తలుపు తెరవనీయలేదు. బయట మరల ఆతృతగా తలుపు శబ్దం. తలుపు నానుకొని అలాగే రాజు కాళ్ళపైకి జారి మాటలు బయటకు వినబడకుండా) నీ కాళ్ళకు మొక్కుతా సోమీ తలుపు తీయకు. వెళ్ళిపో ! నీవు బ్రతికుంటే మా కదే వరాలు పో వెళ్ళిపో సోమీ ;.... (బయట "తలుపు, తలుపు" అంటూ మరల శబ్దం) ఆ పగోడు కాదు సామోయ్, మనోడే. (తలుపు తీసింది)

పడాలు : నమస్కారం రాజా,

రాజు : మా గుండెల్ని గుడిగంటల్లా కొట్టించావ్ ;

పడాలు : ఏమి రాజా ?

రత్తి ; పగోడనుకుంటిమి.

రాజు ; మన దళాలు కదిలాయా ?

పడాలు : కదలడమా ? పొలిమేర కూడా దాటుంటాయ్. బాప్టియన్ బృందం కూడా బయలుదేరిందని వార్త.

రాజు : అయితే పద.

రత్తి : నామాట సెప్పుడి సామీ ?

పడాలు : ఏమిటి ?

రత్తి : సోమీ. ఓరికో పిల్లకు మనసిచ్చిరట....

పడాలు : అమాయకురాలా, మగువకుండే మనస్తత్వాన్ని దాచుకోలేకపోయింది.

రాజు ; సుప్వార్కో.

రత్తి : కష్టమైతే సెప్పకు సామీ !

రాజు ; కష్టంకాదు రత్తి ! నీవేసింది ప్రశ్నకాదు - నా గుండెను గ్రుచ్చిన గాలం,

రత్తి : అట్నా. అయితే సెప్పద్దులే సోమీ !

రాజు ; లేదు. నీద్వారా మరొక్కసారా విద్యుత్కాంతను తలచుకునే అవకాశం లభించింది రత్తీ. మనసేకాదు - తన వెచ్చని హృదయంతో. నాకు స్వతంత్ర దీక్షనే ప్రసాదించింది.

పడాలు ; చపలచిత్తమైన స్త్రీలో అంతటి దేశభక్తిని నమ్మమంటారా ?

రాజు ; అదా పిచ్చోడా ! మట్టిలోంచే మాణిక్యాలు పుడతాయ్. పంకం నుండే పువ్వు పుట్టింది. ప్రజల్లోంచే మహావీరులు పుడతారు. వాట్టి నిరక్షరాస్యులలో చరిత్ర ప్రసిద్ధికెక్కిన వీరవనిత లెందరు లేరోయ్. ఎక్కడివరకో ఎందుకు - మన రత్తి ఎవరంటావ్ ? మట్టిలోంచి పుట్టిన మాణిక్యం కాదంటావా ?

పడాలు ; క్షమించు రాజా !

రత్తి ; బండి నాపైకి దొర్లిస్తుంటిరే,

రాజు ; కాదు రత్తీ ! ఈ నా స్వాతంత్ర ధారణకు ఆమెయే మూలం, అందుకే నాలో ఆమె పేరును జతపరచుకున్నా. సరి, ఇక మేం వెడతాం. పైనుండి మిమ్ము కంటికి రెప్పలా కాపాడే బాధ్యతను గోవిందుకిస్తా. ఆపదొస్తే ఆత్మరక్షణ చేసుకోండి. పద పడాలూ. (వీధిగుమ్మాన వెళ్ళబోయారు)

రత్తి : (అడ్డువెళ్ళి తలుపు గెడవేసి) అటు దొడ్డిదారిని పొండి సోమీ

రాజు : భద్రమమ్మా.

రత్తి : అట్టనే సోమీ. (గెడపెట్టి నట్టింట అడుగు పెట్టగానే వీధి తలుపు కొట్టిన శబ్దం. భయపడుతూనే తలుపు తెరిచింది)

బాప్టి : (తటాలున వచ్చి) ఏంటే కంగారు పడుతున్నావ్. (వెనుక వచ్చిన సబ్ ఇన్‌స్పెక్టరు, పిళ్ళే పోలీసులు సామాన్లను పగుల గొడుతున్నారు.

రత్తి : ఏముంది దొరా ?

బాప్టి : మరెందుకు కంగారు ?

రత్తి : ఏంనేదు దొరా ?

బాప్టి : చెబుతావా ? లేదా ?

రత్తి : ఏంటి దొరా !

బాప్టి : రాంరాజిలా రాలేదూ ?

రత్తి : ఏ రాజు దొరా ?

బాప్టి : ఇంకే రాజు ? యీ మన్యానికి చక్రవర్తిని చేద్దామను కున్నారే మీరు — ఆ బందిపోటు ?

రత్తి : ఏమో దొరా.

బాప్టి : నంగనాచీ. (కొట్టాడు)

రత్తి : [కెవ్వుమంది]

బాప్టి : (తన బృందంతో) చూస్తారేం ? అన్నీ పగులగొట్టండి. [పిళ్ళే పోలీసులు అన్నీ పగులగొడుతున్నారు. సబ్ ఇన్‌స్పెక్టరు పుట్ట చూచి చద్ది తీస్తుండగా)

రత్తి : [అడ్డుపడి] నోటికాడ కూడు మట్టిపాలు చేస్తుదా దొరా [కెవ్వున అరిచింది సబ్ ఇన్‌స్పెక్టరు బళ్ళున చద్దిముంత బ్రద్దలుగొట్టాడు]

బాప్టి : అహహహా. వాహాహా. వెదురు బియ్యం కూడు తిని గొర్రెల్లా మత్తెక్కి మీదా పడతారే — పిశాచీ ?

రత్తి : (పగిలిన పెంకులను పట్టుకొని పేడుస్తూ) నన్నేల బాధిస్తురు?
బాస్టి : బాధిస్తామా, ముక్కముక్కలుగా తరుగుతామా ?
రత్తి : రంపంతో కోయండి — నాకు తెలదు.
స. ఇ. : రహస్యాల్ని హించెవ్వడం తెయసే ?
రత్తి : తెల్దంటిగా.
స. ఇ. : ఖామోష్ ?
బాస్టి : యీ డాగ్ కిలాకాదు బట్టలూడపీకించు.
స. ఇ. : (సాహసించలేదు)
పిళ్ళై : యీయన కెన్న తెరియుము సార్ ? — నేనుదా ఆపని చేస్తును.
(మీదికెళ్ళాడు)
రత్తి : ఆగు. దగ్గరకొస్తివా ?
పిళ్ళై : ఆ యింత పొగరే.
బాస్టి : హూ. పిళ్లే.
పిళ్ళై : (లాగడానికి పైట పట్టుకున్నాడు)
రత్తి : (బాస్టియన్ కాళ్ళబడి) దొరా.
బాస్టి : చెప్పు — వాడెక్కడ?
రత్తి : నాకు తెలవదు దొరా.
బాస్టి : పిళ్లై ఈడ్చుకెళ్ళు. (రత్తి "దొరోయ్, దొరోయ్" అని మొత్తుకుంటున్నా పిళ్లై బరబరా లోనికీడ్చుకెళ్ళేడు) ఊఁ. యిప్పుడైనా చెప్పించు — దానితో.
స. ఇ. : హచ్చా సాబ్. (లోనికెళ్ళాడు. లోపల దెబ్బలు వినబడుతున్నాయి. రత్తి ఘొల్లుమంటోంది. పిళ్లై బయటకు కనబడుతూనే చీర లాగుతున్నాడు.)

జాస్టి : అహాహాహా! (లోపల రత్తి "అపుడి దొరా" పిళ్ళె పీకంతా "చక్" మని లాగేశాడు. లోపల రత్తి కెవ్వుమంది. సబ్ ఇనస్పెక్టరు కళ్లు మూసుకుంటూ బయటకు వచ్చాడు, పిళ్లె, తాను వికటాట్ట హాసం చేస్తున్నారు) అలా చేస్తే గాని లొంగదీ శంఖిణీ జాతి! మైగాడ్, మైగాడ్ చెట్టూ పుట్టా ఎక్కడ చూచినా యీ కొరివి దెయ్యాలే వీళ్ళంతిక కనుక్కుంటా. పురుగుల్లా నలిపేస్తా. పిట్టల్లా కాల్చేస్తా కమాన్ (నలుగురూ వెడుతున్నారు)

రత్తి : (దంచెంపై అంగాలాగి కట్టుకొని పైట చేతుండావే గండ్ర గొడ్డలితో వచ్చి) నమ్మకద్రోహి! (అఖరున వెడుతున్న పిళ్ళె తలపై వేసింది, ఆ దెబ్బ జారి వాటి భుజంపై పడింది)

పిళ్లె : సార్....(భుజం పట్టుకొని తూలుతూ పారిపోయాడు. బయట నుండి పిళ్ళె కేకవిన్న జాస్టియన్ కాల్చాడు.)

గోవిం : నిలండి (రివ్వున అడ్డు వచ్చాడు, ఆ గుండు అతడి శిరస్సులో దూసుకు పోయింది) రత్తీ....(రత్తి "కెవ్వు" మంటూ అందిచ్చిన చేతుల్లోకి వొరిగి పోయాడు. బయట జాస్టియన్ వికటాట్ట హాసాలు)

రత్తి : గోవిందూ....గోవిందూ ! అట్ల చూస్తుంటివేమి ! నన్నొదిలి వెడుతవా ! వొద్దు నా గుండె పగిలిపోతది.... నేను బ్రతకలేను గోవిందూ....

గోవిం : ఏడవకు రత్తీ ఏడవకు ఎన్ని జనమల ఋణమో తీర్చుకొని పోతుంటిని....ఏడవకు, ఏడిస్తే నీ కడుపులో బిడ్డమీద ఒట్టు.

రత్తి : గోవిందూ....నా పసుపు కుంకుమ తుడిచేసి పోతవా ! నాకెన్ని బాసలు చేస్తివి. ఎన్ని ఆశలు పెడితివి. నేనంటే ఎంతో మన

సుంటివే: చేలప్పై ఓరు వొలికేక వేసినా నేనే : లున్నుట్టుంట దంటివే....గోవిందూ....

గోవిం ; రత్తి....ఇక మనం సొర్గంలో కలుసుకుందము, బిడ్డకు సామి పేరు పెట్టుకో, సామికి చెప్పకుండా పోతుంటిని....మన్నించమను రత్తి....(ప్రాణాలు వొదిలేసాడు)

రత్తి ; గోవిందూ....(బోరున నెత్తి కొట్టుకొని ఏడ్చింది) నన్ను విడిచి పెడితివా గోవిందూ....లేదు కోపమొచ్చి వెడితివనుకుంటను.... అవును ఈ పూట నీకు చద్ది పెట్టలేదు కదూ....ఇదిగో తెత్తుంటిని చద్ది....పోకు గోవిందూ, పోకు....

( వి షా దా లా ప న )

ఒత్తుంటీకానోయ్ – మామ
చద్ది - తెత్తుంటినానోయ్
చద్దిలోని నా మనసంతా
పిండిపోసినానోయ్ మామ,
పిండిపోసినానోయ్.

ఏడి, ఏడి నా మామ ? ఇంక రాడు నన్నిడిచి పోయిండు. పోయిండు. గోవిందూ....

రాజు ;- (మహోగ్రంగా దూసిన ఖడ్గంతో అటుచూస్తూవచ్చి) హు పిరికి పందలు – పారిపోతున్నారు. (రత్తి ఏడుపు విని ఇటు చూసాడు) రత్తి, ఏమిటిది ?

రత్తి : (పెల్లుబికిన దుఃఖంతో) సోమీ, గోవిందు చచ్చిపోయిండు ....

రాజు । చచ్చిపోయాడా ? (ఖడ్గాన్ని ఒరలో దూర్చి దిగాలు పడి గోవిందు శిరస్సు చేతుల్లోకి తీసుకున్నాడు) గోవిందూ, జీవితపుటంచుల

తీపినైనా చవిగొనని నీ తనువు ఇంతలోనే చెల్లిపోయిందా? మీసమైనా మొలవని బాలుడవే నిన్ను పొట్టను పెట్టుకొన ఆ కిరాతకులకు చేతులెలా వచ్చాయయ్యా.... రత్తి! యీ పిసికిషూరుని పెదవులేమీ తుది పలుకులు పలకలేదా?

రత్తి ; పలుకకేమీ సోమీ. ఎన్ని జనమల రుణమో తీర్చుకొని పోతుంటినంటిడి, సోమికి చెప్పకుండా పోయినందుకు మన్నించమంటిడి....

రాజు : ఋణం? అతడా మనకు ఋణపడింది, కాదు రత్తి కాదు. అతడికే మనం ఋణపడి వున్నాం. ఆ ఋణం తీర్చుకునేంత వరకూ మన్నించవలసింది గోవిందేనమ్మా గోవిందే.

రత్తి ; ఇంకేమనుకున్నేమి సోమి, గోవిందు విడిచి పోయిందు....

రాజు ; ఏడవకు రత్తి! గోవిందు ఎక్కడికీ విడిచిపోలేదు. దీపాన్ని కాంతీ, పుష్పాన్ని పరిమళం విడిచిపోతాయా? పోవు. ఈమన్యం బ్రతికున్నంతవరకూ, గోవిందు పేరు చెరగదు. ఇకముందు ప్రతీ పనికీ మనకుద్రేకం, వుత్తేజం గోవిందేనమ్మా....

శింగ : (చెమటలు గ్రక్కుతూ వచ్చాడు) సామీ, సామీ.

రాజు ; అదేం శింగన్నా!

శింగ : ఇదెవరు సామీ! పింధూరాన్నారబోసినట్టు నెత్తురు ధారబోసిన యీ వీరుడెవరు?

రాజు : గోవిందు శింగన్నా.

శింగ : అయ్యో గోవిందూ! ఎంతపని జరిగిపోనాది బిడ్డా! ఇంతటి రూపాన్ని నీలో పోతపోసిన ఆ బ్రహ్మకు నీ నొసట తక్కువీడు రాయుటకు చేతులెట్ట వచ్చి వి బాబూ.... (గద్దిస్తూ) సామీ ఇక మన మన్నెం ముత్యాలదండ తెగిపోనాది సామీ.

రాజు ; ఏందుకు శింగన్నా, ఇంతగా కుమిలిపోతావ్ ?

శింగ : అంతా జరిగిపోనాది సామీ....

రాజు ; శింగన్నా !

శింగ : అవును మల్లు పట్టుబడిపోయిండు.

రాజు ; ఆ !

రత్తి : మల్లు మామ దొరికిపోయిండా ?

శింగ : అవును తల్లీ ! అయిదొందల దండుతో వచ్చిన కీరస్సు దొరను రెండు గంటలు నిలబెట్టినాడు.

రాజు : ఆపు, శింగన్నా ఆపు. మన్యం మాతృగర్భంలో దాగిన ఒక యోధుణ్ని ఎక్కడో వున్న ఇంగ్లాండు దొరొచ్చి పట్టుకోవడమా కరకు కత్తులపై నడకలాంటి పోరాటంలో అకారణంగా పట్టుబడ్డం మన్యానికే సిగ్గుచేటు శింగన్నా.

శింగ : ఏం చేత్తుము సామీ. అంతకన్నా ఘోరాలు జరిగినాయి. కొండపల్లి పోరులో అగ్గిరాజే దొరికిపోయిండు.

రాజు : అగ్గిరాజు దొరికిపోయాడా ?

శింగ : ఆ పోరులో ఎర్రేశూ చచ్చిపోయిండు సామీ.

రాజు ; అబ్బ ! నా గుండెలో పిడుగుల్ని ప్రేల్చేవ్ శింగన్నా.

శింగ : సామీ.

రాజు : ఎన్ని ఘోరాలు జరిగిపోయాయ్ ?

శింగ ; ఏమైనా నువ్వెంటనే వెళ్ళడు సామీ.

రాజు : ఎక్కడకు వెళ్ళమంటావు శింగన్నా, వాళ్ళు బ్రతుకుతారా చెప్పు బ్రతుకుతారంటే సప్తసముద్రాలైనా క్షణంలో దాటి వెడతా.

శింగ ; కాదు సామీ ! శత్రువులు గేమాలకు గేమాలు తగలెడుతుంటిరి నే పీడకు వచ్చేసరికి తల ప్రాణం తోక కొస్తిది.

రాజు ; వెడతా, గంటం ఎక్కడ ?

రింగ ; నీ కోసం వెయ్యికళ్ళతో ఏదురు చూస్తుంటడు సామీ ; దారిలో బాస్టియన్ దండును తరుంతున్న పడాలను పవా గంటాన్ని కలవమంటివి వేగిరం వెళ్ళుదు సామి. పితూరీని మట్టిపాలు చేస్తకి అస్సాం రైఫిల్‌దండు వచ్చి పడింది....

రాజు ; అలాగే. మన గోవిందు భౌతికదేహానికి దహన క్రియలు జరిపి....

రత్తి ; గోవిందా....(కూలబడిపోయింది, లైట్లు ఆరాయు వెనకగా ఓ కర్టెన్ వాలింది. ఆ వెనుక చితి. చితికి రెండువైపులా రాజూ రింగన్నలు రివన్నలు వొంచి నిలిచి వున్నారు, రత్తి ఎదుట కూల బడే వుంది)

(నేపథ్యంలో)

వొరిగిపోతివా ? – భూదేవి వొడిలోనే
తెలుగులోకపు కళ్ళ కన్నీరు నింపీ
పయనించి పోతివా ? – స్వర్గాంత సీమలకు
మమ్మిక్క నిషాద, విషాద విష్కంభమున వీడి....

రింగ ; (లైట్లు వెలిగాయి. ఒక్కొక్క అడుగేవేస్తూ వచ్చి) రత్తి....

రత్తి : రింగన్న మామా....

రింగ ; (రత్తి రివస్సు నిమురుతున్నాడు)

(నే ప థ్య ం లో)

పయనించిపోతివా....
మమ్మిక్క నిషాద, విషాద విష్కంభమున పడి....

రాజు ; (వచ్చి నువ్వెళ్ళు రింగన్నా, లేకపోతే....

శింగ : ఏంపోతవి సామి ! భాస్కర్రావు బాబొకసారి విన్ను కలవమ
 విందు [కన్నీరు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు]

రాజు : అలాగే

(నే ప ధ్యం లో)

పయనించిపోతివా....

పచ్చి విషాద, విషాద విష్కంభమున వీచి....

రాజు : రత్తి !

రత్తి : సోమీ....

రాజు : ఒక్కొక్క యోధుడే బరి నొరిగి పోతున్నాడు. పితూరీ రథ
 చక్రం గతుకుల్లో దిగబడిపోయిందమ్మా !

రత్తి : సోమీ ! (బావురుమని ఏడ్చింది)

రాజు : (సాలోచనగా రెండుక్షణాలు గడిచాక ఆకాశంలోకి నిప్పులు
 రువ్వినట్టు చూస్తూ) ఈ దురంతాలకంతకూ మూలం ఆ దుష్టుడు
 గుడాల్. గుడాల్ ! ఇక తలచుకోరా, సీమలోని నీ చక్రవర్తిని
 కాచుకోరా. యీ ఖడ్గధారపై (కదిలాడు)

రత్తి : వద్దు సోమీ. ఆ అగ్నిగుండంలో నువు దూకొద్దు. వెళ్లొద్దు సోమీ
 వెళ్లొద్దు. (కాళ్ళకడ్డపడి కత్తి వొర పట్టుకొని మొరపెట్టుకొంది)

రాజు : రత్తీ. ఇదిగో (ఒరనుండి కత్తి లాగాడు) ఈ ఖడ్గం చేత
 మున్నంత వరకూ నా బొందిలో ప్రాణ మున్నంత వరకూ
 మన్యానికే భయంలేదు. నన్ను వెళ్ళనియ్ గోవిందు రుణాన్ని
 తీర్చుకోనియ్ లే. అడ్డులే. (ప్రక్కకు నెట్టి దూసుకుపోయాడు
 రత్తి చేతి గాజులు పగిలాయి)

రత్తి : (క్రిందపడ్డ గాజు ముక్కల్ని రెండు చేతుల్లోకి తీసుకొని
 ఘోడుమ ఏడ్చింది) సోమీ....

# 5

[అది ఒక ఎత్తైన ప్రదేశం. దాని వెనుక ఆకాశమే కనబడుతోంది. కుడివైపు సైనిక గుడారముంది. ఎడమ వైపు ఒక పెద్ద వటవృక్షం. కుడివైపుకంటా ఊడలు వ్రేలాడిన దాని పలవ వ్యాపించివుంది. ముందు భాగంలో పిళ్లై సబ్ ఇన్‌స్పెక్టరులు చలిమంట కాగుతున్నారు]

గుడాలు ; [తెలుపు సైనికదుస్తుల్లో అడ్డుగా రివాల్వరుబెల్టు ధరించి దొర చుట్ట కాలుస్తూ గుడారంలోంచి దూకుడుగా వస్తూ] ఏకడ బాప్టియన్? (సబ్ఇన్‌స్పెక్టరు పిళ్ళైలు భయంతో గమ్మున వచ్చి ఎటెన్షన్‌లో నిలబడ్డారు)

స. ఇ. : శింగన్న చేత సీక్రెట్ తీయిస్తుండాడు సార్.

గుడాలు : బాప్టియన్ ఏమి తీయించగలడు : నతింగ్. వీడికి ఏమి చేత వాచ్చును. కాన్నలు మూసుకొనిపోయి ఇంతవరకూ ప్రాక్కులో నున్న సర్వెంటు యాతన్ప్నే కాననటువంటి పూలిష్ ఆఫీసరు.... అసలు ఈ రివోల్టుకి కారకుడు – బాప్టియన్.

పిళ్ళై : అవు, అదిదా నమ్మ మొదటినుండీ సొల్లాను సార్.

గుడాలు ; షటప్, యూ.... (పిళ్లై కాలరు పట్టుకొని లాగి) స్కౌంండ్రల్ వానికీ నీకూ బేధమూలేదు వట్టి పూల్స్ ఇడియట్ బోత్ ఆర్ డిస్మిస్డ్. గెటౌట్ [పట్టుకున్న కాలరు వొదిలి పెట్టేశాడు]

పిళ్ళై : సార్

గుడాలు ; ఓ మిస్టెకెన్. మిమ్ము డిసిమిస్ చేసి వేసినచో జనము చూపులో లోకువ యేర్పడి తీరును. యస్. ఎక్స్ప్రెస్ పొమ్ము బాప్టియన్‌తో శింగన్నను వెంటనే పొంపమని చేపుము.

పిళ్ళై : యస్ సార్, (వొణకుతూ వెళ్ళాడు)

గుడాలు : యస్సైప్ నీవునూ పొమ్మ.

స. ఇ. ; హచ్చా సాబ్. (వెళ్ళాడు)

గుడాలు : ఫూల్స్, క్వయిట్ బ్రైన్‌లెస్ ఇండియన్ డంకీస్. రోడ్డు కంట్రాక్టు, పాలుకుబడి గలిగిన మాన్నెం పెద్దలకే యిచ్చియున్న యెడల కూలి ఎక్కువ తాక్కువలు వాళ్ళ నెత్తికే తగులుకొని యూండి వుండును. వాళ్ళ వాళ్ళకే పోట్లాటలోచ్చి కోట్టుకు చచ్చెడి వారు, అందరినీ అణిచివేసెడివారము అహాహాహా, వీళ్ళకు వైట్ ఎడ్మినిస్ట్రేషన్ ఎక్కుగడలేం తెలియును. (గుడారంలో కెళ్ళాడు)

పిళ్ళై ; సొప్పరానాయి ! (చెళ్ళున కొట్టి శింగన్నను త్రోసాడు)

శింగ : (రక్తంతో తూలి పడ్డాడు) అమ్మా !

స. ఇ. : (కొట్టి) హమ్మకాదుబే హమ్మమ్మ కనబడాలి.

బాస్టి : (వికారంగా వచ్చాడు) నమ్మకరాం మా కళ్ళెంతకాలం కప్పావురా,

స. ఇ. ; మన్యానికి పాదుషాలై పోదామనుకున్నారు సాబ్.

బాస్టి : అనుకుంటారు - వెధవలు.(కొట్టాడు)

గుడాలు ; (బ్రాంది త్రాగుతూ డేరాలోంచి వచ్చి) ఆ....ఆ....ఆ....కొటకండి చేప్పివేయును, (కొట్టమని బాస్టియన్‌కు బ్రాందీ బుడ్డితో సైగ చేశాడు)

పిళ్ళై ; వీడొట్టి మరాఠీ ముండాకొడుకు సార్,

గుడాలు ; (బ్రాందీ గుటకేసి) ఏమిరా, నిన్నేమీ చేయరు. సర్కారు యీనాం కూడా లభించును - చేప్పుము,

శింగ ; ఏంటి దొరా ?

గుడాలు ; [తీవ్రంగా] రాంరాజెక్కడ ?

శింగ ; నాకు తెలదు దొరా ?

గుడాలు ; (కొట్టమని సైగ చేశాడు) ఊ (బ్రాందీ గుటకేశాడు)

బాస్టి : [పొత్తికడుపుపై మోకాలితోనూ, వెన్నుపై మోచేతితోనూ పొడిచాడు. శింగన్న "అమ్మా" అంటూ మెలికిరిగి పోతుండగా సబ్ ఇనస్పెక్టరు, పిళ్ళైలు పట్టుకున్నారు]

గుడాలు ; నయాన్ని చేప్పడు - వీడు.

పిళ్ళై ; వుడంబి శుద్ధిచేయాలి సార్.

గుడాలు ; [పూర్తి చేసిన బ్రాందీబుడ్డి నేలను కొట్టి] చేకేర్. నీవు చెప్పక పోయినా, అతుగడుక్కి పి. ఐ. డీ. లున్న మా బ్రిటిష్ ఎంపైర్‌లో రాజు జాడ దొరకదను కొనకుము.

స. ఇ. : ఏ ఠీక్ హై. ఆ విషయంకి నీవు ముందే చెబితే - ఆ కీర్తి దక్కుతుంది బే.

పిళ్ళై : ఫణం దొరుకునురా,

శింగ ; ఏమో దొరా.

గుడాలు : (హూంకరిస్తూ) శింగన్నా, [సబ్ ఇనస్పెక్టరుతో] ఎప్పై నా టెంట్‌లో బేగ్ తెమ్మ.

స. ఇ. : సార్. (వెళ్ళాడు)

గుడాలు : యీపుడు చేపుము,

స. ఇ. : [తెచ్చాడు - సంచి]

గుడాలు ; [సంచి ఎత్తి] యీవిగో రూపాయలు చేప్పుము.

శింగ : అవి నా నాలుకడ్డం తిప్పునా దొరా.

భాస్టి : ఏమన్నావ్ [కొట్టాడు]

గుడాలు : తింక్ ఎగైన్ నీ తలదన్నిన పితూరీ నాయకుల తలబుకొట్టి వేపితిమి. [శింగన్న జుట్టుపట్టి ఎత్తి] చెబుతావా ? చేప్పవా ? [శింగన్న పలుకడు] చావదన్నుము. [జుట్టును "చక్" మని వాదిలేసాడు] లోవికి తీసుకొనిపోయి గోళ్ళ సందున సూదులు గూచ్చుము.

పిళ్ళె : నల్ల ఐడియా సార్.

బాస్టి : పిల్లిని చంకనెట్టుకు తిరిగాముగా,

స. ఇ. : చల్ చల్ బే కోయవెధవా, [శింగన్నను పిళ్ళె సాయం పట్టగా బరాబరా యీడ్చుకుపోయాడు)

గుడాలు : బాస్టియన్ ఊ వేళ్ళుము.

బాస్టి : [వెళ్ళాడు లోపల శింగన్న "అమ్మో అమ్మో" అంటూ ఆరాటా క్రందనాలు వెలిగ్రక్కుతున్నాడు. చెప్పరా చెప్పు. లేకపోతే చావుతధ్యం" అంటూ బాస్టియన్ పిళ్లె సబ్ ఇన్ స్పెక్టరుల కేకలు మధ్యమధ్య వినబడుతున్నాయి. బయట గుడారం ముందు నిల్చి శింగన్నను పెడుతున్న హింసను చూస్తూ గుడాల్ వికటాట్టహాసం చేస్తున్నాడు]

గుడాలు : [రివాల్వరు తీసి] మీరు తొప్పుకోండి.... రెనగేడ్ [కాల్చాడు లోపల శింగన్న "అ...."అంటూ చచ్చిపోయాడు]

పిళ్ళె : [లోపల] చచ్చిండు సార్

బాస్టి : ఆ డొంకలో కీడ్చివేయండి _ శవాన్ని [వచ్చాడు] సబ్ ఇన్ స్పెక్టరు పిళ్ళెలు కూడా వస్తున్నారు.

గుడాలు : } అహ్హా, హహ్హా !
బాస్టి : }

(నే ప థ్యం లో)

గంట : ఆగండిరా ! దుష్టులారా ! ఒకడ్ని కానక మహాత్ముడ్నెంతకాలం చంపుతారో చూస్తా ! తాడో పేడో తేలిపోవాలి నేడు.

గుడాలు : రాండి చాటుకు బాప్టియన్, సైన్యమును రాప్పించుము, (బాప్టి యస్ వెళ్ళాడు. తానూ సబ్ ఇన్స్పెక్టరు, పిళ్ళైలు దేరా వెనక్కి పోయారు)

గంట : (పరశురాములిలా వచ్చాడు. పరశువూ, పిల్లమ్ములూ, తుపాకి అన్నీ వున్నాయి. చేతులనిండా రక్తముంది) రక్తం! (చేతులు చూచుకుంటూ వచ్చి) నులువెచ్చని వేడిరక్తం. యింకా గడ్డకట్టని రక్తం నిండు హృదయం గల దివ్యమానవుల రక్తం భూదేవిని పునీతం చేసిన రక్తం, (బయటకు చూపి) ఇక్కడెన్ని నిండు ప్రాణాలను బలిచేసారో హంతకులు. పిడికెడు మన్యాన్ని పొట్ట పొట్టుకోడానికి కసాయి సైనికులు పదివేలమందా ? (పళ్ళుకొరికి) యీ కిరాతక దుష్కృత్యాలెంత కాలం సాగాలి....? (బయట మిలటరీ మార్చ్ అవుతున్న శబ్దం దేరా వెనుకనుండి నవ్వులు ధ్వనించాయి. తాను తుపాకిపట్టి దిక్కులు పరికించాడు) రండిరా నీచులారా (ధ్వనులు వస్తున్న వైపుకు కాల్చాడు. ఎదురు కాల్పులు తానూ కాల్చుకుంటూ వటవృక్షం వెనుకనుండి నేలను ప్రాకుతూ లోనికెళ్ళాడు, గుడాత్ దేరా వెనుకనుండి ముందు కొచ్చి మరీ కాల్చాడు, ఒక నిముషం గడిచింది. తనకు గుండు దెబ్బ తగిలింది)

బాప్టి : [ఒక ప్రక్కనుండి వచ్చి] ఎగిరిపోయాడు సార్ గంటం.

గుడాలు : ఉష్....ష్....ష్! వాచ్చుచున్నాడు సెట్ బ్యాక్. సెట్ బ్యాక్. [దేరా ప్రక్కకు వెళ్ళిపోయారు.]

గంట : (ర క్తసిక్తుడై, నెత్తురు కారుతున్న డొక్క పట్టుకుని వచ్చాడు) హుం. ఏకాకిని ఎంతరు చుట్టుముట్టారురా? (వెనుకనుండి బాస్టియన్ కాల్చాడు) హా....రాజా (పడిపోయాడు)

పిళ్ళే : (బయటకొచ్చి) చచ్చిపోయిచ్చి సార్ :

గుడాలు } అహ్హా హ్హా హ్హా !
బాస్టి }

(నేపథ్యంలో పడాలు _ "నిలండిరా నీచుల్లారా")

పిళ్ళే : పడాలుదా సార్. పెరియగండం, పెరియగండం,

గుడాలు : సెట్ బ్యాక్, సెట్ బ్యాక్ (అంతా చెదిరిపోయి దాగున్నారు.)

పడాలు : (తుపాకి కాల్చుకుంటూ వచ్చాడు) రండి పారిపోకండిరా పడాలు వద్ద చూపండి _ మీ ప్రతాపం ? (ముందుకెళ్ళగా కాళ్ళకు గంటం తగిలాడు) గంటం.........

గంట : ప....డా....లూ, కొనవూపిరితో పిలిచాడు)

పడాలు : గంటం, (గమ్మున వెన్నువ వేసుకొని ప్రాకుకుంటూ ఎదుటి కొండ వణుకు ముందుకు తీసుకువచ్చి పంచ చెంగు చింపి గాయా లకు కట్టుకడుతున్నాడు)

గంట : [మూలుగుతూనే) పడాలూ నేనింక బ్రతకను....

పడాలు : కాదు _ బ్రతకాలి, నా నెత్తురిచ్చి నిన్ను బ్రతికించుకుంటాను _ గంటం,

గంట : కాదు పడాలూ, నీ నెత్తురు రాజుకియ్, ఆయన బ్రతకాలి. మన్యం కోసం ఆయన బ్రతికితీరాలి, ఆయన్ని మాత్రం కంటికి రెప్పలా....కాపాడుకో....నా....[ప్రాణం వదిలేసాడు]

పడాలు : గంటం (దుఃఖించి) ఇక మన్యం దీపం ఆరిపోయినట్టేనా? మన్యం బాధల్ని హాలాహలంగా మ్రింగిన ఒక మధుర కంఠం మూగవోయినట్టేన్నా? మన్యం మానవత్వం, మానసం, సత్యం ధర్మం ఆకళించుకున్న ఓ మహాకొండ కూలిపోయినట్టేనా— గంటం?

గుడాలు : (గుడారం పక్కకొచ్చి రివాల్వరున్న చేయి చూపుతూ ఊ వెత కండి - ఏకడకి పోయినాడో? (బాస్టియన్ సబ్ ఇన్‌స్పెక్టరు, పిశ్చి వొణుకుతున్న చేతుల్తో రివాల్వర్లు పట్టుకొని వెతుకున్నారు ఆ వెతకడంలో బాస్టియన్ పడాలున్న కొండ పణుకు సమీపం లోకి వచ్చాడు. పణుకు ముందున్న పడాలు వెంటనే గంటం మొలనున్న బాకుతీసి బాస్టియన్‌ను గురిచూచి విసిరాడు)

బాస్టి : మైగాడ్, (చటుక్కున కూర్చుని పరుగెత్తాడు, పడాలు విసిరిన బాకు బాస్టియన్‌ను తప్పించుకొని గుడారం వెనుకనున్న గుడాల్ పైకి దూసుకుపోయింది; రివాల్వరుతో కాల్చవచ్చిన గుడాల్ తప్పుకున్నాడు.)

గుడాలు : ఎనిమీ? ఎనిమీ ఫైరాప్! [బాస్టియన్, సబ్ ఇన్‌స్పెక్టరులు వట వృక్షం వెనక్కిపోయి కాల్చడం మొదలెట్టారు, తానుకూడా పడి పోయిన రివాల్వరు తీసి కాల్చడం మొదలెట్టాడు)

పడాలు ; సీతారామరాజుక్కీ జై! మీ పాపమిక పండిపోయిందిరా (తుపాకి తీసి కాల్చడం మొదలెట్టాడు. రెండు నిముషాలు భీకర కాల్పులు మార్మోగాయ్. తన తుపాకిలో గుండ్లయిపోయాయి. శత్రు వులు నవ్వారు) నవ్వులు కాదురా గవ్వలై పోతారు జాగర్త, నా కండబలమింకా చావలేదు, మీ మారణహోమం ఇకపై సాగదు, మన్నూ మిన్నూ ఏకంగానియ్, మీ హతం తధ్యం (గంద్ర

గొడ్డలితో లేచాడు, లోనికి వెళ్ళాడు. మరణాక్రందనాలు తుపాకి కాల్పులు నెత్తుటి మరకలతో వచ్చాడు. చాటునుండి గుడాల్ బాస్టియన్ ఒక్కసారిగా కాల్చారు. గట్టిదెబ్బ తగిలింది. "అమ్మా. రాజా" ముందుకు తూలాడు. వెంటనే గుడాల్ బాస్టియన్ సబ్ ఇన్‌స్పెక్టరు పిళ్లె వచ్చి చుట్టుముట్టి గుండ్లవర్షం కురిపించారు. హా....హా....హా....కూలిపోయాడు)

గుడాలు : అహ్హాహ్హా. గంటం పడాల్ గిడాల్ అంతా స్మాష్ బ్రిటిష్ మిలటరీ కాడిఫీట్: బ్రిక్కకు ఈడ్చివేయుము. అహ్హాహ్హా (గుడారం లోకి వెళ్ళిపోయాడు బాస్టియన్, సబ్ ఇన్‌స్పెక్టరు పిళ్ళె ఆ రెండు శవాల్ని ప్రక్కకు ఈడ్చేశారు. గుడారంలోంచి బ్రాంది గుటకలువేస్తూవచ్చి] పిళ్ళె. యీయుద్ధములో చచ్చిన మన సిపాయిలను పూడ్చివేయమని చేపుము గో అవ్

పిళ్లె : ఆమా సార్. [వెడుతున్నాడు]

గుడాలు ; యప్పై! చావగా మిగిలిన సైనికులు రెస్టు తీసుకొనమని నీవు చేపుము.

స. ఇ. : హచ్చా సాబ్ [వెళ్ళాడు.]

గుడాలు ; కమాన్ బాస్టియన్. లెటజ్ టేక్ విక్టరీటోస్ట్. ఇద్దరూ గుడారం లోకి వెళ్లారు ఓ నిముషానికి పకపకా నవ్వులు వినబడ్డాయి)

పిళ్ళె : [చెమటలు క్రక్కుతూ] సార్....సార్....సార్! [గుడారంలో అంతా ఒక్కసారిగా హడావిడిగా రివాల్వర్లు సర్దుతున్న ధ్వని]

బాస్టి : [రివాల్వరుతో బయటకొచ్చి] ఏంటోయ్—సార్?

పిళ్లె : రాం....రాం....రాం.... [గుటకలేసాడు]

బాస్టి ; ఏంటీ నీ ముఖం—రాం?

పిళ్ళే : [కంపిస్తూ తిన్నగా చూపుతూ వ....వ....వ....వందొ్వాసార్.

బాష్టి : ఎవరా వస్తున్నది?

స. ఇ. : [రివాల్వరుతో వచ్చి] సీతారామరాజు !

బాష్టి : రామరాజు ! [భయంవల్ల రివాల్వరు జారిపోయింది]

గుడాలు : (రివాల్వరుతో బయటకొచ్చి పేరువిని) రాంరాజు. [రివాల్వరు జారిపోయింది]

పిళ్ళే : ఆమా సార్.

గుడాలు : [నెమ్మదిగా తేరుకొని] రివాల్వర్, రివాల్వర్?

స. ఇ. : హిదిగో సార్ (చేతికందించాడు)

పిళ్ళే : ఇక్కడికే ?

గుడాలు : ఇంకెక్కడికి? సీతారామరాజు "ఆంధ్రాటైగర్" అని విని యుండలేదా – టైగర్-సింగిల్‌గా ఎదుటకే వచ్చి పోరాడును.

పిళ్ళే : అమాసార్ వొన్నుదా మనిషి సార్.

గుడాలు : వెరీగుడ్ అవర్ ప్లాన్ యీజ్ సక్సెస్. వాటేవండర్ టుడే. వెంటనే సైన్యమును రాప్పించుము. ఫిరంగులు బారు చేయించుము. పొమ్మ పొమ్మ. [రంకెలేసాడు]

బాష్టి : ఎస్సై నువ్వెళ్ళు.

పిళ్ళే : వందొచ్చాసార్——ర్ [అందరి చాటుకు వెళ్లాడు]

రాజు : [ఖడ్గంచేబట్టి కొండలావచ్చినిలిచాడు. అందరి గుండెలూ గుభిల్లుమిన్నాయి. వొణకుతూ రివాల్వర్లు గురిపెట్టారు? చుట్టూ చూచి తీవ్రంగా) రాజీకని పిలిచి బయటా ఫిరంగు లెందుకు?

గుడాలు : రాజీకవి వాచ్చిన నీ చేతిలో కాత్తి ఎందుకు ?

రాజు : అందుకే బయటా ఫిరంగులన్న మాట?

గుడాలు : అవును.

రాజు : సరి ఇప్పుడే చూడగలను _ నీ నిజాయితీ. యిదిగో ముందుగా నేనే అస్త్రసన్యాసం చేస్తున్నా. [ఖడ్గాన్ని ఎదుట పారవేశాడు) ఇక మీ రివాల్వర్లు క్రింద పారేయండి, బయట మరఫిరంగుల్ని తొలగించండి.

గుడాలు : ఆహాహాహా—బాస్టియన్— బాందించుము (సంకెళ్ళు తెచ్చి, వాహాహా హఠాత్తుగా రెండుదండలకూ తగిలించి, ఒక ప్రక్క పిళ్ళై రెండో ప్రక్క బాస్టియన్ బిగించి పట్టుకున్నారు)

రాజు ; ఎంత మోసం. ఓటమి నొప్పుకొని, క్షమాపణ చెప్పుకుంటానని రప్పించి ఒక నిరాయుధుడ్ని బంధిస్తావురా, నీచుడా,

గుడాలు : నీవు బంధిపోటువు కాబట్టి.

రాజు : ఏమన్నావ్, దేశం కాని దేశంలో పుట్టి దేశం కాని దేశం మెట్టి దేశదేశాల్ని కొల్లగొట్టె గజబంధిపోట్లు మీరు! ధర్మ వన్నాలు చెప్పి విలువదోపిడీలు చేసే పయో ముఖ విషకుంభాలు మీరు జాగర్త! కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలన్న తెలుగుజాతి బిడ్డడ్ని నేను, గగనాన్ని తాకిననగం ఢీకొన్న మరఫిరంగై! ప్రేల గలజాతి నాది. కదనంలో నెత్తురుచేరులు పారినా మృగేంద్రంలా పోరగలదు, భీకరతుపానును సైతం దూసుకుపోగల మెరపుగత్తి నా జాతి, పోటెత్తిన పెన్నిధులే నా జాతి బడబాగ్ని ముందు మండిపోతాయి జాగర్త!

స. ఇ. : (వచ్చి రాజును చూచి ముఖం చాటేసుకున్నాడు)

గుడాలు : మిలటరీ వచ్చినదా యస్సై ?

స. ఇ. : (కంపిస్తూ) యస్ సార్.

రాజు : ఒక అరక్షణీయుని కోసం ఆ మిలటరీ ఎందుకు? యీ ఆర్భాట హేర్భాట లెందుకు?

గుడాలు : పారిపోవుదవు గానుక.

రాజు : ఏమిటి కూసావ్ గుడాల్, పారిపోయే పిరికివాళ్ళం మేమా? రాజీ కని రప్పించి కాల్చడానికి తయారవుతున్నావే ఇది పిరికితనం కాదా? మీ కలక్టరు రూథర్ మా పల్నాటి వీర హనుమంతును రాజీకని పిలిచి చంపినది — పిరికితనంతో కాదటరా, ఓ నరరూప రాక్షసుడా! అటులనే నన్నూ వొంటరివాడ్నిచేసి కాల్చాలని చూస్తున్నావేమో. జాగర్త నీవు కాల్చే ఆ కాల్పులకు నా గుండె ల్లోంచి చిందే ప్రతి రక్తపుబిందువు మీ మృత్యువును కోరే కోటానుకోట్ల అల్లూరి సీతారామరాజులై వెలస్తాయి. ఆ వెలసిన వీరుల కత్తి దెబ్బలకు పిడ్డపడితే కాల్చరా, లంపటుడా, ఇదేరా తెలుగు బిడ్డ గుండె ఇదేరా సీతారామరాజు గుండె. రక్తంలోనే పిరికితనం ప్రవహించే పందః నీ రాజకీయాలలో ధర్మమేవుంటే రారా, కాల్చు.

గుడాలు : (బయట మిలటరీ మార్చ్ అయింకా తన బృందాన్నుద్దేశించి) సెట్ బ్యాక్ (బయట మిలటరీ నుద్దేశించి) ఫైరాన్. (కేకపెట్టి తన బృందంతో పారిపోనుంకించాడు. బయట "రణ గోణ" ధ్వనులు సీతారామరాజు పటిల్లున సంకెళ్ళు త్రెంచుకొని మహో గ్రుడై విజృంభించాడు)

రాజు . పారిపోతావేమిరా గుడాల్ ఏదీ కాల్చమను నీ సైన్యాన్ని ఇది ప్రళయకాలరుద్రకీల భద్రకాళి, అగ్నిగోళనేత్రం. ఈ నేత్రం తెరవబడిందా విన్నేకాదు. సముద్రాంతరాల కావల దాగియున్న ఫీ కుక్కగొడుగు సింహాసనాన్ని సైతం అగ్ని సిక్తం చేసి

భగ్గున మండిస్తుంది. భీరుడా రమ్మను శక్తుంటే కాల్చమను [మహోగ్ర రూపం చూపిస్తూ] తమ కళ్లెదుట పగిలే మహోష్ట భీకర జ్వాలాజ్వలిత మహాగ్ని పర్వతాన్నే గాని తట్టుకోగల శక్తుంటే కాల్చమను. అడుగడుక్కీ రుధిర తర్పణచేసి శతపోరు సాగించిన మా కట్టబొమ్మ నాయకుని కత్తి వ్రేటులు అప్పుడే పాతబడిపోయాయా? మొక్కవోని క్షాత్రతేజంతో రణంచేసి కనబడిన మీ పీమ దొరనల్లా తెగనరికిన మా కోయరాముని మరచి పోయారా ? మీ ముప్పేట దాడులనుండి మూడురోజుల హోరాహోరీ పోరు సల్పి, మీ చివరి నెత్తుటి చుక్కని కూడా చవిచూచిన మా ద్వారబంధాల చంద్రయ్య మీ స్మృతిపథంలో మెలగడం లేదా ? మీ శిరస్సులను త్రుంచి నిజాం నవాబుకు కానుకగా పెట్టి పంపిన మా తెలంగాణా వెంకటయ్యను మీ కళ్ళముందు నుండి అప్పుడే తుడిచేసుకున్నారా ? [విజృంభించడానికి కుప్పించాడు. "ధన్, ధన్, ధన్" మంటూ గుండ్లొచ్చి కడుపులో దూసుకు పోయాయ్. రక్తధారలొలుకుతున్న కడుపును అలాగే పట్టుకొని తూలుతూ] ఎంతకు తెగించారురా, తెల్లకిరాతకుల్లారా సర్వదేశాలను కబళించి రత్న రాసులతో తులతూగుతున్నామని విర్రవీగు ఓ మానవరూప ముష్కరులారా మర తుపాకులతో, మందుగుండు సామాగ్రితో మీ సైనిక పశుబలంతో నా భారతజాతిని బానిసత్వంలో వుంచగలమని వూహించకండి. మీ రెన్నటి మన్నసూ సరే, సముద్రాలకు సముద్రాలు దాటి మీ లండన్ నగర వీధు లలో తలదాచుకున్నాసరే, సముద్ర గర్భాంతరాలలో సేద దీర్చుకున్నసూ సరే, దుర్గమకొండల దాటి కారడవుల పుట్టల్లో నక్కినా.సరే మీరు బ్రతు గ్గలమని భావించకండి. [ఒక మరఫిరంగి పెను గర్జన: సీతారామరాజు భువి నొరిగిపోయాడు] వందే మాతరం.... వందే మాతరం........ [దుష్టచతు ష్టయం "అహ్హహ్హ" అంటూ ఒక్కుమ్మడిగావచ్చి "చచ్చినాడు" అంటూ ఒక్కుమ్మడిగా వెనక్కి వెళ్ళిపోయి లోపల మార్చి బ్యాక్" అని అరిచారు.

లోపల మిలటరీ వెనక్కి సాగుతున్న అలజడి వినబడుతోంది. వెడుతున్న దుష్టుల్ని చూసి) నేను చావలేదు, నా అంతరాత్మ నిరాకారమై మీ అంతాన్ని ప్రబోధిస్తూనే తిరుగుతుంది. రేపు ముక్కోటి సీతారామరాజులు తమ నలభై కోట్ల తమ్ములతో మీపై పగ సాధిస్తారు. భారత గడ్డనుండి సమూలంగా మిమ్మ తుడిచేస్తారు....అప్పుడు....నా దేశం స్వతంత్ర మవుతుంది.... వందేమాతరం .... (ప్రాణాలు విడిచాడు, పెళపెళార్భాటాలతో భువి దద్దరిల్లింది. మేఘాలు వురిమాయ్)

రత్తి : సోమీ....సోమీ........[రోదిస్తూ రివ్వున వచ్చి మృతదేహంపై పడింది]

( నే ప థ్యం లో )

రాలిపోయెనుగదా సీతారామరాజా
తళతళ మెరసి రాలిన తారకను బోలి
మ్రింగివేసెనుగదా వెలుగు వెదజల్లిన
పున్నమి చంద్రునో గరళ ఫణీంద్ర మొకటి
మునిగిపోయెనుగదా నీ పతనమున కతన
దేశమే ఒక దుఃఖార్ణవమున.

# అల్లూరి సీతారామరాజు
## ఏకపాత్రాభినయం
## (విల్లమ్ములతో సీతారామరాజు)

ఎంతదారుణం ! ఎంత క్రౌర్యం ! తరతరాలుగా హాయిగా మన్యం వాసులు అనుభవించే అడవులను సర్వే చేయించి అందులో అడుగుపెట్టిన అమాయక మానవులను క్రూరమృగాలకుమల్లే వేటాడుతారా ! - ఈ వికృష్ట బ్రిటిషు కిరాతకులు! స్వేచ్ఛగా పశువులుమేసే బీళ్ళకు కంచె వేయించి. అటు పశువులు ప్రవేశిస్తే బందెల దొడ్డిలో బంధిస్తారా కర్కశులు! తమ కండ బలంతో బండలను సైతం బ్రద్దలుకొట్టి ఎండకు నడినెత్తి కరుగుతున్నా, ములుకుల్లాంటి రాళ్ళకు పాదాలు పగులుతున్నా, కొండలపై రోడ్లువేసే అమాయకులపై అత్యాచారమా! బట్వాడా అడిగితే చెట్లకు మానవులను కట్టి చర్మాలు తీస్తారా ! మర్మస్థానాల్లో కారాలు కొట్టి హింపిస్తారా ! ఎంత పైశాచిక కృత్యం !

ఒకనాడు పచ్చగావున్న మన్యమంతా ఈ సీమదొరలు పెట్టిన ముఠాధారీ విధానానికి మాడిపోయి చింతంబలి త్రాగి పాద పారాణీ కూడా ఆరని పసికాంతలే వల్లకాటికి చేరిపోతున్నారే !

ఎంతకాలం సాగాలీ ఆగడాలు! పీడను దేవతగా పూజించే అరమరిక లేని జాతిపై ఇంతటి రాక్షస హత్యాకాండా !

ఎవడిచ్చాడు దొరలకీ హక్కు ! తన గడ్డకాని గడ్డపై అడుగుపెట్టి కఠిన దౌర్జన్యానికి దిగిన ఈ దొరతనాన్నిక దగ్ధంచేసి తీరకపోతే మన్యానికి బ్రతుకేలేదు.

అదే బానిస విముక్తి! స్వాతంత్ర్య స్వశక్తి! బానిసగా నిత్యం చచ్చే కన్నా వీరుడిగా పోరాడి చావడం ముక్తి !

బ్రిటిషు నిరంకుశులపై తిరుగుబాటు, పరపీడన ప్రభుత్వంపై విప్లవం ప్రతి మానవుడి జన్మహక్కు !

ఈ సీతారామరాజు ఒక్కడేకాదు. మన్యం వీరుల కంఠ కొనవూపిరు న్నంతవరకూ, సీమదొరలశబ్దం భరతఖండంలోనే వినిపించ వీలులేదు. సింహాలు విహరించే మన్యసీమలో నక్కలకు స్థానముండరాదు.

పులినైనా పిలిచి చంపగల మన్యంజాతే తలచుకుంటే, ఈ దొరలకు తృటిలో మతులూ గతులూ లేకుండా చేయగలదు.

మల్లూ, గంటం, పడాలూ ! అశేషమన్యం అనహాయ శూరులారా ! కరిపైకి లంఘించే కొదమసింగములారా ! కదలండి ! కదనానికి !

మూపున మూడునెలల బిడ్డను కట్టుకొని స్వతంత్ర పోరాటం సల్పిన ఝాన్సీ లక్ష్మియే మనకు విప్లవజ్యోతి ! ప్రేగులు ప్రోగుకైనా వెన్నిచ్చి ఎరుగని తెలుగుబాలుడు మనకు వెలుగుబాట. ఆ జ్యోతి కాంతిలో ఆ వెలుగు బాటలో సాగినవానికి సాధ్యం కానిదిలేదు. అతడసాధ్యుడు! అజే యుడు....నరుడు తలచుకుంటే నల్లరాళ్ళేకాదు. ఉక్కు పర్వతాలైనా చెక్కముక్కలై తీరుతాయి. పదండి వీరులారా ! విజయం మనదే....

(వెళ్ళబోతూ అటు చూసి)

అదుగో ! శింగన్న చెప్పిన కవర్టు హైటర్లు వాళ్లే ఐవుంటారు. మన్యం సంపదను తెగమెక్కి కైపెక్కి ఎలానడుస్తూ వస్తున్నారో చూడండి వాళ్ళనూ వాళ్ళ సైన్యాన్ని నేనీ ప్రక్కవాగులోకి మళ్ళిస్తా. మల్లూ ! నీవూ గంటం ఆ తెల్ల ముష్కరుల్ని చంపండి. వాళ్ళెప్పుడైతే చస్తారో అప్పుడు వాళ్ళ సైన్యంలో ముసలం పుడుతుంది, బెదిరి చెదిరిపోతారు. పడాలూ, నీవు, వీరయ్యదొరా అదిగో ! ఆ కొండప్రక్క పొదలో మాటేసి కాల్చండి సమపని శౌర్యంతో సమరోత్సాహంలో చిందులు త్రొక్కే మనకోయ, చెంచు, రేచులు మీకు అండదండగా వుండాయి. వాళ్ళు తిరుగుముఖం పట్టే త్రోవలో నేను కాపి అమ్ముల వర్షంతో కూల్చివేస్తా. ఆ చివర కొండకావల మన్న గోవిందు దళం ఆ కొండలపై మంచి పెద్దపెద్ద బండలను దొర్లించి వాళ్ళ పుర్రెలు పుచ్చకాయల్లా పగిలేలా చేస్తుంది! అంతే జాగర్త !

ఈరోజు ఆంధ్రజాతి చరిత్రలో భారత స్వాతంత్రేతిహాసంలో సువర్ణ ఘట్టం కావాలి. మాతృగడ్డకోసం ఆత్మ బలిదానమిచ్చిన బెంగాల్ బెబ్బులులు మహారాష్ట్ర మత్తేభాలు, పంజాబ్ సింహాలు తెలుగువీర తురంగాలు తలపుకు రావాలి. (ముందుకువచ్చి) వెళ్ళండి! వృధాగా ఒక్క తూటా కూడా కాల్చవద్దు. ఒక్కొక్క తూటా మన కొక్కొక్క వీరుడు సుమా. అటూ ఇటూ ఎటుచూసినా మనవాళ్ళే కనబడాలి. తెల్లవాళ్ళ కళ్ళుచెదిరిపోవాలి. సాధ్యం కానిది సాధ్యం చేయగలిగితేనే మానవుడసాధ్యుడౌతాడు! సరే : మీరిక ఎవరి స్థానాల్లో వారు సర్దుకోండి! నే వెళ్ళి ఆ మృగాలనా వాగులోకి రప్పిస్తా జాగర్త. ఒకడికి పదిమందిని పరిహారం తీసుకోవాలి. శత్రువును గ్రుక్క తిరక్కుండా కొట్టాలి.

(దొరల నుద్దేశించి) ఓ తెల్ల కిరాతుకుల్లారా. మానవరూప మేచ్ఛుల్లారా. సర్వదేశాలను కబళించి రత్నరాశులతో తులతూగుతున్నామని విర్రవీగు ఓ నరభక్షకులారా. మర తుపాకులతో మందుగుండు సామాగ్రితో మీ సైనిక పశుబలం సిద్ధంగా వుందని గర్వపడకండి. మీ చెప్పటమన్నా నూ సరే సముద్రాలకు సముద్రాలు దాటి మీ లండన్ నగల వీధుల్లో తలదాచుకున్ననూ సరే సముద్ర గర్భాంతరాళాల్లో సేదదీర్చుకున్నా సరే దుర్గమ కొండలు దాటి కారడవుల పుట్టల్లో నక్కినా సరే, మీరు బ్రతగ్గలరని అనుకోకండి. ఈ సీతారామరాజు మిమ్మలను క్షమించడు, సహించడు.

[ నే ప ధ్యం లో ]

"ప్రచండ సమరం సాగింది. నరభక్షకులని పేర్గాంచిన కవర్డు హైటరులు హతమయ్యారు, మన్యం అగ్నికొండలలో బ్రిటిషు సైన్యం దగ్ధపటలమైంది, పీమలోమన్న దొరతనం కొత్తపన్నాగాలు పూనుకొంది. రూధర్ ఫర్డుదొరను మన్యానికి పంపింది, సీతారామరాజు ఏ ప్రజల స్వేచ్ఛా సుఖాల కోసం పోరు సాగించాడో అవి నెరవేరుస్తామని సంప్రదింపుల కోసం రమ్మని రూధర్ మన సీతారామరాజును తన వద్దకు రప్పించాడు. ఇక చూడండి – ఆ అంతిమ ఘట్టం"

## 4

(సీతారామరాజు ప్రేటుతిన్న బెబ్బులిలా వచ్చాడు)

ఏమిది! రూధర్ ఇంత రాక్షసమా! రాజీకవి రప్పించి మరఫిరంగులతో మారణాయుధాలతో స్వాగతమిస్తావా ?

ఆ, ఏమన్నావ్ ? నేను బంధిపోటునా! దేశంకాని దేశంలో పుట్టి. దేశంకాని దేశం పెట్టి దేశదేశాల్ని కొల్లగొట్టె ఆ గజ బంధిపోట్లు మీరే. ధర్మపన్నాలు చెప్పి నిలువు దోపిడీలుచేసే పయోముఖ విషకుంభాలు మీరే. నేనంటావా, కొడితే. ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలన్న తెలుగుజాతి బిడ్డన్ని. గగనాన్ని తాకిన నగం ఢీకొన్నా మరఫిరంగై ప్రేలగల జాతి నాది. కదనంలో నెత్తురేరులు పారినా మృగేంద్రంగా పోరగలదు. భీకర తుఫానును సైతం దూసుకుపోగల మెరపు కత్తిది – పోటెత్తు పెన్నుధులే. నాజాతి బడబాగ్ని ముందు మండిపోతాయ్ జాగర్త.

ఏమి కూసావ్ రూధర్! మేమా పిరికివాళ్ళం! రాజీకవి రప్పించి కాల్చడానికి వయారపుతున్నావే అది పిరికితనం కాదా ? రా, ధైర్యముంటే కాల్చు. కాల్చరా నీచుడా. పల్నాటి వీరహనుమంతును రాజీకవి పిలిచి చంపిన ఓ నరరూప రాక్షసుడా, కాల్చు. నీవు కాల్చిన కాల్పులకు నాగుండెల్లోంచి చిందే ప్రతి రక్తబిందువూ మీ మృత్యువును కోరే కోటానుకోట్ల అల్లూరి సీతారామరాజులై వెలుస్తాయి. ఆ వెలసిన వీరుల కత్తిదెబ్బలను కాచుకో! కాల్చరా జటుడా. ఇదేరా తెలుగు బిడ్డ గుండె. ఇదేరా సీతారామ రాజు గుండె.

రక్తంలోనే పిరికితనం ప్రవహించే ఎలుగా. జాతిలోనే నీచత్వం కరుడు కట్టిన లుబ్ధా. నీ రాజకీయాల్లో ధర్మమే వుంటే. నీ గుండెల్లో వేడి నెత్తురేవుంటే రారా యుద్ధానికి రా.........రారా రూధర్. ఇది ప్రళయ కాల రుద్రకీల, భద్రకాళీ, అగ్నిగోళ నేత్రం. ఈ నేత్రం తెరవబడిందా, నిన్నేకాదు. సముద్రాంతరాల కావలయున్న నీ కుక్క గొడుగు సింహాసన

న్ని సైతం అగ్నిపి క్తంచేసి భగ్గున మండిస్తుంది. భీరుడా శక్తుంటె కాల్చు (కోపంతో) నీ కళ్ళెదుట పగిలే మహోష్ణభీకర జ్వాలాజలిత మహాగ్నిపర్వతాన్ని తట్టుకోగల శక్తుంటె కాల్చు!

అడుగడుక్కీ రుధిరతర్పణచేసి శతపోరు సాగించిన మాకట్టబొమ్మ నాయకుని కత్తివ్రేటులు అప్పుడే పాతబడిపోయాయా? మొక్కవోని క్షాత్ర తేజంతో రణంచేసికనబడిన మీ సీమ దొరనల్లా తెగనరికిన మా కోయ రాముని, మీ ముప్పేట దాడులనుండి మూడురోజులు హోరాహోరీ పోరు సల్పి, మీ చివరి నెత్తుటి చుక్కని కూడా చవిచూచిన మా ద్వారబంధాల చంద్రయ్య, మీ శిరస్సులను త్రుంచినిజాం నవాబుకు కానుకగా పళ్ళెరములో పెట్టి పంపిన మా తెలంగాణా వెంకటయ్యను అప్పుడే మరచిపోయారా ? రూథర్ ,ఎవరు పిరికివాళ్ళు ?

(రూథర్ కాల్చాడు రాజాకు గాయమైంది)

అ.... ఓరి పిచుడా, ఎంతకు తెగించావురా ? నేను చనిపోయినా, నా అంతరాత్మ చనిపోదు. అది నిత్యమై నిరాకారమై మీ అంతాన్ని ప్రబోధిస్తూనే తిరుగుతుంది. రేపు ముక్కోటి సీతారామరాజులు తన నలుబదికోట్ల తమ్ములతో మీపై పగసాధిస్తారు! భరతగడ్డనుండి సమూలంగా మిమ్ము తుడిచివేస్తారు. అప్పుడు నాదేశం స్వాతంత్రం అవుతుంది, ;( బాధతో ) అమ్మా భారతీదేవి, నేను విడిచిన కార్యాన్ని నా అనుంగు తమ్ములు నెరవేరుస్తారు. నీకు దాస్య విముక్తి చేస్తారు. కర్పూర నీరాజనాలతో నీకు హారతులిస్తారు. తల్లీ....నన్ను నీ ఒడిలోకి చేర్చుకో........జననీ.... వందేమాతరం....వందేమాతరం,

(రాజా వొరిగిపేయాడు)

— ౦ —

# శ్రీ పడాల ప్రముద్రిత రచనలు

1. విప్లవ మహాయుగం
2. శివకన్య 4 భాగాలు
3. ఆంధ్రశ్రీ
4. సీతారామరాజు
5. సామ్రాట్ అశోక్
6. సింహగిరి
7. కట్టబొమ్మ నాయకుడు
8. పలనాటి యుద్ధం
9. వీరబొబ్బిలి
10. శివయోగి
11. వసంతసేన
12. శాక్యముని
13. టిప్పు సుల్తాన్
14. ఖడ్గ తిక్కన
15. వీరహనుమంతు
16. చంద్రకాంతమణి
17. రాణా రాజసింహ
18. అభిషిక్తుడు
19. రామాయణం
20. మహాభారతం
21. భాగవతం
22. ఉత్తర రామాయణం
23. శృంగారనైషధం
24. కాదంబరి
25. శకుంతల
26. మనుచరిత్ర
27 పారిజాతాపహరణం
28. కళాపూర్ణోదయం
29. గంగా – గౌరి
30. నాస్తికుడు
31. శ్రీముఖం
32. తిరుపతి
33. చరిత్రహీన
34. సంఘం
35. గ్రామదేవత
36. ఖైదీ
37. నిజమా, నాటకమా !
38. కాంతా కాంచనాలు
39. జై జవాన్
40. గోర్కీ – నా ప్రపంచం
41. " అమ్మ
42. " డాలరు పిశాచం
43. మహాకవి గోర్కీ
44. భయం
45. ఘోరం
46. ద్రోహం
47. స్నేహం
48. ద్వేషం

౫౦ నారం దాగదు

51 శిల్పకన్య

52 వీరపింహా

53 సువర్ణసుందరి

54 1001 రాత్రులు

55 అగ్నితోరణం

56 చిలుకచెప్పిన రహస్యం

57 యీ కన్య అమ్మబడును

58 రంభను కూడిన కూలీ

59 అపూర్వ సోదరులు

## నాటకాలు

60 సీతారామరాజు (21 ముద్రణ)

61 నేతబిడ్డ

62 భూదేవి

63 సందేశం :

64 ఇదా స్వతంత్ర్యం ?

65 సంకెళ్ళు

66 పీ. ఓ. ఎవరికి

67 నా ప్రేతకుడు

## నాటికలు

68 అరదండాలు

69 స్త్రీ

70 దురాశ దుఃఖానికే

71 మృణాళిని

73 సంక్రాంతి కానుక

74 అభాగిని

75 సీతారామరాజు (బుర్రకథ)

76 స్టాలిన్

77 మరో ప్రపంచం

78 మార్క్స్—ట్రేడు యూనియన్లు

79 లెనిన్—ట్రేడు యూనియన్లు

80 విమల

81 అంబ

82 రాణి

83 వత్సల

84 దుర్గ

85 బ్యాంకింగ్ పరిశ్రమ లోపాలోపాలు—నివారణోపాయాలు

86 AIBEA చరిత్ర

87 మనచరిత్ర

88 చెరగని జ్ఞాపకాలు

89 బాలలబొమ్మల పంచతంత్రం

90" రామాయణం

91 " మహాభారతం

92 " మహాభాగవతం

## త్వరలో

93 సీటికాకులు

94 అమ్మ (నాటకం)

95 ఎందుకమ్మా ఏడుస్తావ్ ? (కావ్యం)